# ప్రతిభ

1936

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపాదకుడు : [illegible]



వర్షా సంచిక

'Nayani'

# నవ్యసాహిత్యపరిషత్తు. గుంటూరు

## గౌరవాధ్యక్షులు:

రావుసాహెబ్, మహోపాధ్యాయ, వ్యాకరణాచార్య
గిడుగు వెంకట రామమూర్తి పంతులు గారు

## ౧౯౩౬ : కార్య నిర్వాహక వర్గము :

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, అధ్యక్షుడు
చింతా దీక్షితులు, ఉపాధ్యక్షుడు
తెలికిచర్ల వెంకటరత్నం, కార్యదర్శి

## సభ్యులు:

మండపాక పార్వతీశ్వర శాస్త్రి
పురిపండా అప్పల స్వామి
మొక్కపాటి నరసింహ శాస్త్రి
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
జనమంచి కామేశ్వర రావు
పిలకా గణపతి శాస్త్రి
అడివి బాపి రాజు
కొడాలి ఆంజనేయులు
నోరి నరసింహ శాస్త్రి
తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి
చిలుకూరి నారాయణ రావు
కొంపెల్ల జనార్దన రావు

## పూర్వాధ్యక్షులు:

చిలుకూరి నారాయణ రావు, ౧౯౩౩
రాయప్రోలు సుబ్బా రావు, ౧౯౩౩-౩౪
తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి, ౧౯౩౪-౩౬

*

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ * ఆగష్టు : ౧౯౩౬ * సంచిక ౨



*

*

### "ప్రతిభ"కు విరాళములు

| | | | |
|---|---|---|---|
| నోరి నరసింహ శాస్త్రి గారు, బి. ఏ., బి. ఎల్. | ... | ... | రూ ౧౦ |
| తెలికిచర్ల వెంకట రత్నం గారు, ఎం. ఏ., ఎల్. టి. | ... | ... | ,, |
| కోమాండూరు కృష్ణమాచార్యులుగారు | ... | ... | ,, |
| పెద్దిభట్ల వెంకటా చలపతి రావు గారు, బి. ఏ., బి. ఎల్. | | ... | ,, |
| డాక్టరు అమంచర్ల శేషాచలపతి రావు గారు | ... | ... | ,, |
| వింజమూరి పార్థసారధి గారు, బి. ఏ., బి. ఎల్. | ... | ... | ,, |
| గోగులపాటి వెంకయ్య గారు, ఎం. ఏ. | ... | ... | ,, |
| మంత్రిప్రగడ సాంబశివరావు గారు, బి. ఏ., ఎల్. టి. | ... | ... | ,, |
| ఉప్పుటూరి వెంకట పున్నయ్య గారు | ... | ... | ,, |

*

# విషయానుక్రమణిక



## విన్నపము

నవ్యసాహిత్యపరిషత్సభ్యులూ, చందాదారులూ, దయ ఉంచి సాధ్యమైనంత త్వరలో తమ చందా రూ ౨ పంపవేడుతాము. మూడవ సంచిక వీ. పీ. ద్వారా పంప నవసరం లేకుండా చేయవలెనని ప్రార్థన ... ప్రతిభ సంవత్సరచందా రూ ౨

కార్యదర్శి . నవ్య సాహిత్య పరిషత్తు . గుంటూరు

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక

సంపుటము ౧ : ధాత : వర్షా సంచిక : సంచిక ౨


## భారతీ శతకము


గిడుగు వేం॥ సీతాపతి


శ్రీరాగస్వరమేళనాంచిత విపంచీతంత్రులన్ హాయిగా
"సారీమా పనిసా రిగారి సగరీ సానీప రీగారి సా
సారీ" యంచును గోట మీటుచును నీశాంతాకృతిన్ జూపి న
"న్నోరీ లే" మ్మని మేలుకొల్పితివి నాఁ డోతల్లి! యోభారతీ!

"ఓరీ యేటికిఁ గాలయాపనము? ధీయుక్తుండ వై యుండియున్
సారస్యాన్విత పద్యకావ్యరచనా సామర్థ్యసంపత్తి యిం
పారన్ గల్గియుఁ జెప్పవేమి యొకకావ్యంబైన సీతాపతీ!
ఆరంభించి జయంబు నొందు" మని కాదా యంటి వోభారతీ!

భయమో విస్మయమో భవన్మధురవాగ్వైచిత్ర్యసమ్మోహమో
జయమున్ బొందుదు నన్నగర్వితమనస్సంజాత సంతోషమో
పయి కొక్కింతయు నాకృతజ్ఞతను దెల్పన్ వాక్కు నాకట్టె; న
ట్లయినన్ డెందమునిండ భక్తి గల దమ్మా నమ్ము మోభారతీ!

నీమృదువాక్సుధారసము నీనవువెన్నెలఁ గూడి చల్లనై
నీమధురాంతరంగమున నెక్కొను ప్రేమ మెలర్పఁ దీయనై
నీముఖపుండరీకమున నిల్చి స్రవింపఁగ నిర్మలంబునై
నామదిఁ గోర్కె తీగలఁ దనర్చెడు సారము నయ్యె భారతీ!

అంత నొకింతసేపటికి స్వాంతమునందు ప్రశాంతి యొప్పు; న
త్యంతము సంతసం బొదవ; ధైర్యము చిక్కఁగ నీదయారసం
బెంతయుఁ దొల్కరింపఁ జిగిరించిన నానుషు లుప్పతిల్లె; నీ
వంత నదృశ్యవైతివి గదా యిఁక నెట్లు వచింతు? భారతీ!

శ్రావ్యంబై రసవంతమై మధురమై సర్వాంగసంపన్నమై
నవ్యంబై పరిణామరూపగతులన్ రంజిల్లుచున్ భావముల్
సువ్యక్తం బొనరించుచున్ జగమునన్ శోభిల్లువా క్కెల్లయున్
దివ్యంబౌ భవదీయరూప మగుచున్ దీపించు నో భారతీ!

వాక్కే నీవును నీవె వాక్కనియున్ భావింతు; నాలోపలన్
నిక్కం బా పరమాత్మకాంతి కరమున్ దీపింపఁగాఁ జేయు నా
వాక్కే నన్నెఱుఁగించు నన్యులకు; నావాక్కే మదీయాత్మయా;
వాక్కే వ్యక్తముచేయు విశ్వమున తత్త్వజ్ఞాన మో భారతీ!

నలువకు రాణివై వెలసి నల్వురినోటను నాట్యమాడుచున్
బలుకువెలందివై సకలభాషలు, విద్యలు, శాస్త్రముల్, కళల్
వెలయఁగఁ జేసి యీయఖిలవిశ్వమునందును జ్ఞానతేజము
జ్జ్వలముగ భాసిలన్ బఱపి పాపుదు మోహతమంబు భారతీ!

నీయాజ్ఞన్ శిరసావహించి యెదియేనిన్ జిన్నకావ్యంబు నే
వ్రాయంబూనితిఁ గాని, కావ్యమున నేభాషన్ బ్రయోగింపనా
నో యూహించుట కష్ట మయ్యె, వ్యవహారోత్పన్నమై సభ్యమై
మాయాంధ్రావని నున్నభాషను రచింపన్ జెల్లదే? భారతీ!

అవివేకం బయినా గతానుగతిక న్యాయంబుగా నేఁటికిన్
స్తవనీయం బగుపద్యకావ్యరచనా సత్సంప్రదాయంబుగాఁ
గవిలోకంబునఁ గావ్యభాష యని ప్రఖ్యాతంబుగా నున్నదే
యవలంబించి రచింతు నీశతకపద్యా లొప్పుగా భారతీ!

వ్యవహారాంధ్రము యోగ్య మంచు బహుకావ్యాలందు గన్పట్టు స
ద్వ్యవహారోక్తులఁ గొన్ని చూపెదను నావాదప్రసంగంబు లొ
ప్పునో కావో వచింపుమమ్మ! యిఁక నీ వంగీకరింతేని మా
వ్యవహారోక్తి రచించి కావ్యమును నీకర్పింతు నో భారతీ!

పూర్వాచారపరాయణత్వ మను పెన్భూతంబు మాపృథ్విపై
సర్వవ్యాపియు బ్రహ్మరాక్షసియునై స్వాతంత్ర్యమున్ జంపి యీ
యర్వాచీనుల కెల్ల పూర్వమతదాస్యం బిచ్చి మాసృష్టి మా
పూర్వావస్థల నిల్పి ముందుగతికిన్ బోనీయ దో భారతీ!

జననం బాదిగ నెల్లజీవుల కవస్థాభేదముల్ మార్పులున్
అనయంబున్ భువిఁ గల్గుచుంట సహజంబై యొప్పుఁ; నాకీతిగాఁ
దనరున్ భాషయు జీవ మున్నవఱకున్; దల్లక్షణాల్ "ప్రవా
హినియున్ నిత్యయు నౌను భాష" యని కాదే యందు రో భారతీ!

అణుమాత్రం బగుమఱ్ఱివిత్తనము మొల్కై లేచు; నేపారుఁ; జి
క్కనిచెట్టై సనలెత్తి కాచు; నురుశాఖల్ సాచు; సందుండి నే
లను దాఁకన్ బడు నూడలన్ విడుచు; వేళ్ళన్ జాచు; నట్లేకదా
తనరున్ భాషయుఁ బ్రాణమున్నవఱకున్ దప్పేమి యో భారతీ!

జెలలై పుట్టి స్రవించి వర్షములచేఁ జెన్నొంది, శాఖానదుల్
గలియన్ బెంపును బొంది, పుష్కలతరంగశ్రేణి నృత్యంబుతో
నలరన్ బాఱెడునమ్మహానదుల సామ్యం బొప్పి, భాషానదుల్
విలసిల్లున్ భువి నెల్లకాలమును నిర్విఘ్నంబుగా భారతీ!

తరములవెంబడిన్ బహువిధంబుల వర్ధిలుచున్నభాష, మా
తరమున వారినాల్కలను దాండవమాడుచు నున్నభాష, యా
దరమునఁ జేరఁదీసి తలిదండ్రులు నేర్పినభాష యాట, మా
కరయఁగ మాతృభాష; కృతులందు రచింపఁగ రాదె భారతీ!

నుడికారంబు భవత్ప్రసాదమున నానోటన్ విరాజిల్లు; నే
నుడు లీనాల్కను దాండవించు నవి యాంధ్రుల్ పల్కుశబ్దంబులై
యడరున్ గావునఁ దప్పు లేటి కగు; నాహా శిష్టులున్ బల్కుమా
నుడులన్ గ్రొత్తవి తప్పు లంచుఁ బలుకన్ యోగ్యంబటే? భారతీ!

ప్రాచీనాంధ్రమునందు పెక్కుతరముల్ భాసిల్లుశబ్దంబు ల
ర్వాచీనాంధ్రమునందు గొన్ని వ్యవహారభ్రష్టముల్ సూవె! యా
ప్రాచీనాంధ్రమునందు లేనినుడు లుత్పన్నంబులై కొన్ని య
ర్వాచీనాంధ్రమునందు సభ్యములుగా రంజిల్లవే? భారతీ!

నన్నయభారతంబునఁ గనంబడు నచ్చతెలుంగు శబ్దముల్
గొన్నివిధాల మార్పులకు లోనయి తిక్కనసోమయాజి యె
ఱ్ఱన్నలయాంధ్రభాషఁ గననయ్యెడు; నిట్టుల రానురాను పె
ద్దన్న తెలుంగు మారినది; తప్పదు భాషకు మార్పు భారతీ!

వ్యవహారంబున లేకపోయినసరే ప్రాబల్యమే యొప్పు; న
ద్వ్యవహారంబునఁ బుట్టి వర్ధిలిన నర్వాచీనశబ్దంబులన్
గవితన్ గూర్చుట తప్పనన్ దగునె? వృక్షంబందు నెక్కొన్న ప
ల్లవముల్ ద్రుంచుచు జీర్ణపత్రముల నిల్పన్ జూతురే భారతీ!

ఎవ రాంధ్రోక్తులకున్ నియామకులు? తల్లీ! తెల్పవమ్మా, లోకులా?
కవులా? లక్షణకర్తలా? ఎవరివాక్ప్రామాణ్య మెట్లుండునో,
ఎవ రెవ్వారికి బద్ధులో, ఎవరివాక్కేరీతిఁ గైకొందురో
వివరింపన్ దగుఁ గాన సత్యమును నీవే తెల్పుమో భారతీ!

కనవే భాషకు శబ్దసిద్ధి యెటు "లోకాత్ దృశ్య" యంచెంచి ల
క్షణశాస్త్రజ్ఞులు శబ్దశాసనములో స్పష్టంబుగా వ్రాసిరో;
కనవే కావ్యములన్ గవీంద్రు లెటు లోకంబే ప్రమాణంబుగాఁ
గొని లోకోక్తుల దేశ్యశబ్దములఁ గైకొనంచిరో భారతీ!

ప్రాణము గల్గి వర్ధిలెడుభాషల కెప్పుడు శబ్దసిద్ధి లో
కాన నెఱుంగవచ్చు ననఁగాఁ గవిలోకమునే గ్రహింపఁగా
నౌ నని కొంద ఱాడురట! అట్లయినన్ గవికిన్ బ్రమాణ మే
డా నన లోకమే యని కదా మరలన్ వచియింతు భారతీ!

కవియే యైనను బండితుండె యయినన్ గానిమ్ము భాషించుచో
వ్యవహారంబును మీఱలేఁడు నుడులన్ బ్రౌఢత్వమున్ జూపనీ
వ్యవహారంబున లోకు లాడుకొను జీవద్భాషకున్ గ్రంథముల్
కవులున్ బండితులున్ బ్రమాణ మని పల్కన్ జెల్లునే? భారతీ!

అరుదే చిన్నయసూరికిన్ మునుపు గద్యగ్రంథ మాంధ్రంబునన్
అరయన్ నూర్లకొలందిగాఁ గలవు: దివ్యక్షేత్రమాహాత్మ్య స
చ్చరితాఖ్యానములున్ వినోదకథలున్ శాస్త్రప్రసంగంబులున్
సరసంపున్ వ్యవహారభాషను మహాశాస్త్రీయంబులై భారతీ!

కవులందున్ మొదలింటివారి కృతులన్ గన్పట్టునాంధ్రోక్తి స
ద్వ్యవహారోక్తియె కాదె కేవలము? నాతర్వాతివారందఱున్
వ్యవహారోక్తికిఁ దోడు పూర్వకవిశబ్దంబుల్ ప్రయోగింపఁగాఁ
గవిలోకంబునఁ గావ్యభాష ప్రబలెన్ గా దంచు వే? భారతీ!

ఒకదేశం బొకకాల మొక్కకవి యం చుద్దిష్టము లేక స
ర్వకవివ్యాహృతిబద్ధమై, వివిధసూత్రాకీర్ణమై శిష్టశా
కికశబ్దేతర శబ్దరూపగతియై గీర్వాణసంశ్లిష్టమై
సకలాంధ్రావనిఁ గావ్యభాష చెలఁగున్ ఛందోగతిన్ భారతీ!

మహి మున్ శిష్టులనోటఁ బుట్టి, కవిసమ్మానంబునన్ దేవవాక్
సహవాసంబును బొంది, వ్యాకరణరక్షాబంధ సూత్రాలచే
మహనీయస్థితి గాంచి, పండితులకే మాన్యంబుగా నిల్చినీ
బహుకావ్యోద్ధృతభాష సాధ్యమగునే భాషింపఁగా భారతీ!

"పలుకులపొందు లేక రసభంగము సేయుచుఁ బ్రాతపడ్డమా
టలఁ దమకేర్పు సూపుచు" నటంచు వచించినతిక్కనార్యుప
ల్కులఁ గలభావ మేమి? తనలోకమునన్ వినఁబడ్డపల్కులన్
బలుకుచుఁ గాదె సత్కవి ప్రబంధము లెల్ల రచించు భారతీ!

పలుకులసౌ రెఱుంగు కవివర్యుని పల్కులు తప్పు లౌనె? పూ
ర్వుల కిది గ్రామ్యరూప మని, పూర్వపుకబ్బములందు లేనియీ
పలుకులు పల్కనా యనియుఁ బల్వురుఁ దామును బల్కుపల్కులన్
గలుపక మానిరే కవులు కావ్యములన్ రచియింప? భారతీ!

తమపూర్వుల్ రచియించుకావ్యముల శబ్దా లొక్కభాషాచరి
త్ర మెఱుంగన్ దలపెట్టుపండితుల కాధారంబులై యుండుఁ; గా
వ్యము చెప్పన్ దలపెట్టునేఁటికవికిన్ బ్రామాణ్య మీనాఁటి శ
బ్దములం దొప్పును గాని నాఁటినుడులన్ బ్రోత్తించునే? భారతీ!

వ్యవహారాంధ్రమె కాక యన్య మగునే ప్రాచీనకావ్యాలలో
కవులందున్ దొలివారు వాడినది ? లోకంబందు లేనట్టి ప
ల్కే వఁడైనా సృజియింపఁ జెల్లునె ? యటే యీనాఁడు మే మాడు స
ద్వ్యవహారోక్తులఁ గావ్య మేల రచియింపన్ జెల్లదో భారతీ !

ఏకాలంబున నున్నశిష్టజను లేయేపల్కులన్ బల్కిరో
ఆకాలంబున నున్నకావ్యముల నాయాపల్కు లొప్పారుటన్
మాకాలంబున నున్నశిష్టజను లేమాటల్ ప్రయోగింతురో
మా కామాటలు పద్యకావ్యరచనామాన్యంబులౌ భారతీ !

ధర నేపెద్దలభాష పిన్నలకు నాదర్శంబుగా నొప్పు; నె
వ్వరియుచ్చారణ పిన్నవా రనుకరింపన్ జూతు రాపెద్దవా
రరయన్ శిష్టులు; శిష్టులౌజనులప ల్కాధారమై యుండు వ్యా
కరణంబున్ రచియించుపండితులకున్ గా దందువే ? భారతీ !

వాడుకభాష వ్యాకరణబద్ధము కా దనువా రెఱుంగరో
వాడుకభాషకే మొదటివ్యాకరణంబు జనించె నంచు; మా
వాడుకభాష కల్లె యొకవ్యాకరణంబు రచింపరాదె ? మా
వాడుకభాషకంటెఁ దొలివాడుకభాష ఘనంబె ? భారతీ !

తొలుదొల్తన్ జను లాడుశబ్దములయం దుత్పన్న మైనట్టిభా
షలు "మున్ వ్యాకరణాది లాక్షణికసంస్కారంబు లానాఁటిపె
ద్దలుగావింప ద్విజత్వ మొందె" ననుచున్ దద్యోగ మీనాఁటిభా
షల కేలా కలిగింపఁజూడ రిపు డాచార్యోత్తముల్ భారతీ !

ధౌరంధర్యముఁ బూని వ్యాకరణసూత్రంబుల్ ప్రదర్శించి, "సం
స్కారార్థో నియమో" యనన్ "వలయు భాషాశుద్ధికై లోకభా
షారూపంబును మార్చి శబ్దములకున్ శౌచక్రియాకల్పసూ
త్రారూఢత్వము గూర్చు" టందురట ! యాహా పండితుల్ భారతీ !

అలకాత్యాయను ప్రాతిశాఖ్యమున వ్యాఖ్యానంబుకంటే పతం
జలిభాష్యంబున సుప్రసిద్ధ మగునీసంస్కారశబ్దానకున్
గలయర్థంబు గ్రహింపవచ్చు; నది ప్రఖ్యాతంబులై యున్నమా
టలకున్ బ్రక్రియ విప్పిచెప్పు టని స్పష్టంబౌఁ గదా భారతీ !

అకలంకం బగుశిష్టలోకమునఁ బ్రఖ్యాతంబు లౌశబ్దముల్
సకలం బున్నవి యున్నయట్లఁ గొని సంస్కారంబు గావించుచోఁ
ప్రకృతిప్రత్యయ భావలక్షణము, వర్ణాదేశలోపాగమ
ప్రకృతిప్రక్రియ చేసి చెప్పుటయె కన్పట్టున్ గదా భారతీ !

కోరినరీతిఁ గుండలను గుమ్మరి చేయఁగలండు గాని నే
గోరినరీతి శాబ్దికుఁడు గ్రొత్తపదంబు సృజింపఁ గల్గునే
కారికలన్ రచింపఁ ? దనకాలమువారు వచించుపల్కులే
యారసి శబ్దశాసనుఁడు వ్యాకరణంబు రచించె భారతీ !

— సశేషము —

*

# పశ్య !

## విశ్వనాథ సత్యనారాయణ

గిరుఁకొమ్మల నడవుల తిరుగుచుండి
కోకిలమ, యెంత మృదువుగ కూయుచుంటి !
నాగరకలోకమునయందు నడచుచుండి
ఎట్లు పలుకుచు నుంటిమో యేము చూడు !

గరిక తిని కొండసెలనీరు గతుకుచుండి
హరిణమా, యెంత నిర్మాయి వగుదు వీవు !
ఎల్ల వ్యవహారకుశలత యేర్పరించి
ఎట్లు నడచుచు నుంటిమో యేము చూడు.

వగరు పొగవెన్నెలచివళ్ళు వంట నొక్కి
ఓచకోరమా, రససిద్ధి నొందె దెంత !
మధుమధు పదార్థములలోన మమత పెంచి
ఎట్టి శుష్కజీవనులమో యేము చూడు !

*

# ధన్యజీవి

జి. జాషువ

కొఱ్ఱిస్త్వకాఱుదున్నవలెఁ గొమ్ములతోఁ బసఁగుమ్ముమున్న పె
ద్దవ్వకు తేఱుదేవతకు నంజలిఁబట్టెదఁ దద్గళంబులో
గవ్వలపేరు నాగృహసుఖంబుల నెల్లఁజాలు గంజిలో
బువ్వకుసూపశ్రీకసాక సృష్టి యసు సాసుఖ మర్థమయ్యెడిన్.

ఆపకు నాస త్రోడుపడి యల్లరిసేయునెడంపితోడ న
భ్యాప మొనర్చినాఁడను సఫంబుగ మేపలు గట్టువృత్తి, ఈ
రాసభయాన, రొండిపసరాలని, నన్ను వహించుసంత, ని
ద్రాసుఖ మర్థ మైనది విదాహము దీప ని కేమి కావలెన్ !

తుకతుక లాడురక్తమున దూకులు బెట్టెడుపౌరుషంబుతో
నొంపిసిఁ దగ్గిపోవ ననుసుబ్బర మిల్లి నశించిపోయె, గు
డెకు బరువైన త్రొంటిబుకపీపకు లిప్పుడు లేవు, లేమల
న్మకు దయరాకయుండినఁ బ్రశాంతత నేను యూసచ్చియుండునో.

తిరిపెపువమ్మిటీ తలవి దీపముగా వెలిగించి, దీపమే
రొటుగని నాకుటీరమున నృత్యమొనర్చు మహాపిరాటి, చిం
పిరితల చిక్కులన్ను, తరిపీయుతు వేసె నన్ను నుక్కీకిం
బరువుగ, గబ్బిలాయిగఁ, దృణంబుగఁ, జుల్కనగా, వాలిక్కిగా.

చెఱకుం బిండిన లీల నాబలము నోర్పెన్ గానుగం బట్టి, యూ
పిరి పోఁ, దెమ్ములపోవు నిల్పినది, నావేషంబు నీక్షించి, నా
సరసన్నిల్చుట కేవగించుకొని, జ్యేష్ఠాదేవి భీతిల్లె, నిం
కొరుఁ డేలాఁగున నిబ్బరించు నిపుడో హా! యింతధన్యాత్ముఁడన్.

కలికమునకు నేను గావలె ననువాఁడు
నెఱిఁగియున్నవాఁడు ధరణి లేఁడు.
ఈయనంతసౌఖ్య మేరాజు రుచిజూచు
నేఁడు నామనంబు నిశ్చలంబు !

# మువ్వ గోపాలా . . .

వెంపటి నాగభూషణం

భాగవతకాలంనాటి 'నందాంగనాడింభకుడు' వ్రేపల్లెలో ఉన్నయావత్తు గోపికా గణాన్ని మురళీధ్వనిసైగతో, యమునఒడ్డుకు తరలించుకునిపోయి లౌకికము లైన ఎన్ని అల్లరులు చేసినా చివరకు యోగీశ్వరుడే, వేదాంతపథవిహరణధీరుడే.

నిప్పుకు చెద లంటనట్టు, భగవంతుడికి గోపాంగనారత విషయిక మైనదోషం అంటదనీ, అదీ గాకుండా, పరు లెవరు- తా నెవరు, 'సర్వమయుడు లీల సల్పె గాక' అని బొత్తిగా కుర్రతనంగా బుకాయించి దాటేశాడు, శుకమహర్షి, పరీక్షిత్తు తీరా నిలవేసి అడిగేసరికి. ఈలా ప్రత్యక్షంగా గ్రంథస్థ మైనప్రమాణాలు ఉన్నా, ఆచెదలు తమకు ఎక్కడ అంటుకుంటవో అని ఇప్పటికీ, ఆస్తికాగ్రేసరులైన సనాతనమూర్తులు, 'రతి'కి 'విరతి'కి పైగా అర్థం చెప్పడానికి సంశయిస్తున్నారు. చుట్టాల గరితలపైటలో, చెయివేసి ఏమేమొ చేసె ననుచు, వ్రాసికొన్నారు బాపనబైసిగాండ్రు, కొలముసామి విచారించుకోక యిట్లు, చేయునే యంచు పెద్దల చేత వినెడు, కృష్ణకథలందు – నిటువంటి వెల్ల – వినడు.' హంసవింశతికథల్లో, విష్ణుభక్తుడు, ఓగోపాలుడు.

కాని. ... ...

ఎంత శుద్ధనిర్గుణ పరతత్త్వానికైనా, బాంగ్లావాళ్లు, రాధను తీసుకువచ్చి అంటగట్టేటప్పటికి- శృంగార చైతన్యచంద్రోదయం కాక తప్పిందికాదు. రాధ ప్రేమవాహిని అయినా, భగవంతుడు ప్రేమసాగరు డైనా, వాళ్ళసంగమం, వేదాంత రీత్యా పారిభాషికరూపాన వ్యాఖ్యాత మైనా, 'ప్రేమ'మాత్రం, ప్రేమగానే, మామూలీప్రేమగానే, నిలిచిపోయింది. చైతన్యసాంప్రదాయానికి, రూపగోస్వామీ మొదలైనవాళ్ళమద్దత్ ఆట్టేకాలం నిలవలేదు. అటు ఔత్తరాహులు, ఆచార్య గోవర్ధనాదులు-శృంగారరచనలతో విజృంభించి, శృంగారానికి మధ్యమరస మనే ప్రతిష్ఠను శాస్త్రగ్రంథాలలోకూడా కల్పించి, అతఃపూర్వపు రసనిర్ణయాలను ఉల్టాసీదా చేశారు. 'వాసుదేవ రతికేళికథాప్రసంగ' పర మని, జయదేవుడు, స్వకావ్య-ఇతివృత్తాన్ని ప్రకటించాడు. అక్కడితో రవంత తెరచాటూ తొలిగిపోయింది. అసలు

ఒకసంగతి : ఇంతకూ దేవతావిషయిక మైనరత్యాదివర్ణన గర్హ్యమని నియమం ఉన్నా, ఉల్లంఘనంకూడా కాళిదాసాదుల విషయంలో కనబడుతూనే ఉన్నది కాదూ ? పోనీ, దేవేంద్రుడికి స్నేహితుడూ, తత్తుల్యవైభవోపేతుడూ అయిన నైషధుడి ఔపాసనకార్యం సందర్భాన హర్షుడేమన్నా మొగమాటపడి టూకీగా వదిలేశాడా ? శంకరుడంతవాడు, అమ్మవారిపేరు చెప్పి ఇప్పటి పాఠ్యగ్రంథాల్లో చుక్కలు పడిపోయిన కచకుచాదులు విరివిగా వాడలేదూ ?

బిల్వమంగళ యతీంద్రుని ప్రసాదాన, కృష్ణుడు దివ్యమంగళవిగ్రహుడై, శృంగారసామ్రాజ్యానికి పట్టభద్రుడైనాడు. గోపికలు నిత్యయౌవనులు కారు. వాళ్ళ విలాసాలకి, అతని బాలక్రీడలతోపాటు వార్ధక్యం వచ్చింది. మాయామానుష దేహుడైనా, శృంగారనాయకుడుగా, ఏకైకవీరుడుగా, స్థిరప్రతిష్ఠను- స్థాయిని, దక్కించుకున్నాడు కృష్ణుడు.

వీరవిహారానికి పురికొల్పే శైవధర్మంమీద అభిమానం అక్కడక్కడ ఉన్నా, దాక్షిణాత్యులందరికీ అనుష్ఠానంలోకి వచ్చేది వైష్ణవమే. కృష్ణుడూ, అతడు చేసే పనులూ- అంటే ఆదరమే. ద్రావిడభాషలు అన్నింటిలోనూ కృష్ణునిశృంగారలీలలను వర్ణించే గీతాలు ఉన్నవి.

తెలుగులో పదవాఙ్మయం బహుళంగా ఉన్నది. కృతు లన్నింటికీ, విశిష్టంగానైనా, అధ్యవసాసరూపాన అయినా కృష్ణుడే నాయకుడు : నాయికలు చాలవరకు గోపికలు కారు.

రసాత్మక మైనవాక్యలేశానికే కావ్యగౌరవం లభించగలిగితే, క్షేత్రయాదుల రచనలకు విలువను ఊహించడానికైనా కష్టం.

నన్నయకు పూర్వమందు, ఈమాదిరిపదరచన ఉన్నదా లేదా, మొదలైన తమాషావాదాలు లేవదీయడానికైనా మనకు ఆధారాలు లేవు. కాని తెలిసినంత వరకూ, త్యాగయ్యగారితాత, గిరిరాజకవికూడా ఈలాటిరచనలు చేశాడు.

పదకర్తలు ఎవరూకూడా త్యాగరాజ దీక్షితాదులలాగా, స్వరసమ్మేళనం విషయంలోగాని, నూతనజన్య రాగచ్ఛాయా నిరూపణమందుగాని, శ్రమపడలేదు. అమలులో ఉన్న ప్రసిద్ధరాగములనే అవలంబముగా చేసుకుంటూ రచనలు సాగించారు. భక్తిరూపావతారములైన కృతులలో ఉండేపారవశ్యము వీటిలోనూ ఉన్నది.

పదసంయోజనంలోనూ, భావవైఖరులలోనూ, విన్యాసక్రమంలోనూ మాత్రం, కృతు లని వ్యవహృతము లవుతూండే సంకీర్తనలు, శృంగారపదములకు ఎక్కడా, ఎంతమాత్రమూ చాలవు.

అభినయముకు చాలా అనువుగా ఉండటంచేత, భరతవిద్యా ప్రదర్శనావసరము లలో శృంగారపదముల ప్రయోజనము అపరిమితముగా ఉన్నది. కేవలం సంగీతాన్నే అభిమానించేవిద్వాంసులు సహితం, హాయికోసం, అనురంజనంకోసం, పరిషత్తుల్లో, త్యాగరాజాదుల కృతులతోపాటు, పదములనుకూడా పాడుతూండటం, సాంప్రదాయసిద్ధ మని, పారంపర్యంగా వస్తూన్నప్రసిద్ధి. తెలుగుదేశంలో, ఈ ఆచారం, రకరకాల చిలిపికారణాలచేత ఈమధ్య మాసిపోయినా, దాక్షిణాత్యులు మాత్రం ఎప్పటికీ ఒకేతోవను పోతున్నారు.

ఇప్పటికి మనకు తెలిసినంతవరకూ, గ్రంథబాహుళ్యంచేత, ప్రచారవశానా, క్షేత్రయ పదకర్త లందరిలోనూ ముఖ్యుడు, ప్రాచీనుడు. క్షేత్రజ్ఞుడు, క్షేత్రియులు, క్షేత్రయ (య్య) అనికూడా వ్యవహరిస్తూ ఉండటం ఉన్నది. కాని, ఆయన అసలు పేరు ఏమిటో తెలుసుకోవలె నని ప్రయత్నంచేసినా ప్రయోజనం లేకపోయింది. వంశీయులు ఎవరూ ఉన్నట్టు తెలియలేదు. పదములలో ఎక్కడాకూడా, నిజ నామాన్ని ఉట్టంకితముచేసుకొన్నవాడు కాడు. (1)

కృష్ణామండలంలో 'మొవ్వ' అనేగ్రామం దివితాలూకా భాగవతులకూచి పూడికి కోసెడుదూరంలో రోడ్డువార ఉన్నది. అది క్షేత్రయ స్వస్థల మని, గృహ నామంకూడా అదే నని వాడుక. అక్కడ గోపాలస్వామి ఆలయం చాలా సామాన్యపుది ఉన్నది. ఆగోపాలాంకితములుగానే పదములు రచించాడనేమాటకు, జన శ్రుతితప్ప వేరేప్రమాణం లేదు. రచనలయావత్తు మొత్తాన, 'మువ్వగోపాలు' డని ప్రయోగములే కాని, మొవ్వగోపాలు డని ఏవ్రాతప్రతిలోనూ ఎరుగున్నంతవరకూ,

(1) భరతశాస్త్రనిధి, స్వర్లోకవాసి వెంపటి వెంకటనారాయణగారు, 'క్షేత్రియ' అనేది గౌరవ నామము, లాంఛనము అనిన్నీ, అసలు ఆయనపేరు వరదయ్య, యింటిపేరు మొవ్వ, ఈలా తాము పెద్దలవల్ల విన్నట్టు చెపుతూఉండేవారు. పదములలో కొన్నిచోట్ల వరదా! మువ్వగోపాలా! అని కనబడటం దాన్ని సమర్థిస్తూన్నది అని వారివాదం. కాని, కరిగిరివరద కంచివరద వంటిప్రయోగాలు విశేషించి 'వరద' సహయోగములుగా కానవస్తూ ఉన్నా, కృతిగర్భితాభిధాన చమత్కారం కన్న, గ్రంథబాహుళ్యవశమున, బహుశః క్రమవశమున సంకలితములే కాక అన్వర్థము అని నిర్ధారించుటకు వీలు లేకుండా ఉన్నది.

కనబడలేదు. 'మొవ్వ' 'మువ్వ'గా వాడుకలో మారిపోయిం దని అంగీకరించ వలసిందేనా ? (2)

పోనీ, ఈప్రాంతాలవాడే అని ఒప్పుకోవచ్చును, అన్యథా నిరూపించడానికి అవకాశం లేనందువల్ల. కాని, ఆతడు జీవితమంతా పరదేశాల్లో, ఇతరసంస్థానాల్లో గడిపినట్లు కనబడుతూంది. ప్రసిద్ధ వైణవిద్వాంసుడూ, కవీ గనుక, రసికశేఖరు లైన మధుర, తంజావూరుప్రభువులు వీరి కోరి, వద్దకు పిలిపించుకుని తమదగ్గర నిలుపుకొని ఉండవచ్చును. బహుశః, తనరచనలను మధురంగా, సరసంగా గానం చేసే నేర్పే కాకుండా, గోవిందసామయ్యలాగా, వేషధారణం చేసి, స్వయంగా అభినయించగల తాహత్తుకూడా ఉండి ఉండవచ్చును. (3)

---

(2) రూపావతారవిధాతలు శబ్దతాత్త్వికులు ఏలా సాధించుతారో, కాని—

1. ఇటువంటివాడ వను చిపుడు
తెలిసెనురా-
ఏటరాయ! ము (మొ?) వ్వ పురివిభు
వైనగోపాల ...
2 తరుణి మువ్వపురిధాముడు
నను కూడి ...
3. మువ్వపురినిలయునితో
కలసి మెలసి ...

— అంటూ స్పష్టంగా ప్రయోగములు కనబడుతూన్నప్పుడు, పారంపర్యంగా అతర్కితమై వస్తూన్నదే అయినా నిలిచిపోయిన వివరాలను తోసివేయడానికీ సంశయం కలిగి, వెనుక ముందాడ వలసి వస్తూన్నది. ఏమో 'ము' వ్వ కాదు, 'మొ' వ్వ అని యతిప్రాసనిర్బంధముల ఆధారాన అయినా నిశ్చయించడానికి వీలులేనిస్థితిలో అలా సరిపెట్టుకోవడమే ఉత్తమం- దాక్షిణాత్యవిలేఖరుల సత్య- 'గుణింత'- అభిజ్ఞతను అవలంబనంగా చేసుకోవడంకన్న !

(3) పండితుడు కవి నటవతంసము గోవిందసామయ్య, వెంకటముఖి శిష్యపరంపరలోనివాడట. వాగ్గేయకారరత్న మైనయాతడు, కార్వేటినగరసంస్థానాధిపతి తనప్రభువు 'మాకరాట్కులాంభోధి కైరవహితుడు' సరసుడు వెంకటపెరుమాళ్ రాజేంద్రునిపరముగా రచించిన వర్ణములు, మోహన, కేదారగౌళలలోనివి అతిప్రసిద్ధములు. ఇప్పటికీ గాయకసార్వభౌములు కళ్ళకు అద్దుకుంటారు.

—రచించి అంతలో ఊరుకోకుండా, నాయికాభూమికను ధరించి వాటిని అభినయిస్తూ, రాజసభలో అందరిని పరవశులను చేసినాడని వినికిడి.

మువ్వపదంలో ఉన్న లెక్క ప్రకారం నాలుగు వేల అయిదువందల పదములకు పైగా క్షేత్రయ్య రచించి ఉండవలె.

మధుర తిరుమలనాయకుడిసమక్షాన రెండు వేలు, తంజావూరు విజయరాఘవుని కోరికమీద వేయి, గోలుకొండ పాదుషావారి ప్రధాని మూర్తిపంతులు ప్రార్థన మీద వేయిన్నర.

కావచ్చును: ఇప్పటికీ దక్షిణదేశం మారుమూలల్లో 'తాళీదళసంపుటప్రకర కాంతారాల్లో' చిక్క, మందసాల్లో, పూజాగృహాల్లో రహస్యంగా మూలుగుతూన్నవి మూడు వేలపదములదాకా అని వర్షీయాంసు డైన ఒకకూచిపూడిభాగవతుడు తానూ బాగా ఎరుగున్నట్టు చెప్పాడు. (4)

ఆయనకుమాత్రం ఏపదో పాతిక్కోకన్న ఎక్కువ రావు!

అన్నీ కలిసి ఇప్పుడు లభిస్తూన్నవి మూడువందలకు మించవు. (5)

తెలుగునాటను తీర్థయాత్రలు చేసి అధిష్ఠానదైవతములను మువ్వ గోపాలునితో అభేదాధ్యవసాయరూపమున పదరచనతో గౌరవించి సేవించుకుంటూ క్షేత్రయ్య, దక్షిణదేశసంచారమునకు బయలుదేరాడు. 'భోగబిడౌజు' డైన తిరుమలనాయకుడు సపరిశ్రియంగా 'సముఖానకు రప్పించుకుని' తన రాసిక్యానికి ధన్యత కల్గించుకున్నాడు. మధురలో రాజ్య - అతిధిగా ఉన్నప్పుడు చెప్పినా డన్న రెండు వేల పదములలో ఇప్పుడు లభ్యము లౌతూన్నవి ఆరు. రాజుమీదను, సేనాని తుపాకుల వెంకటకృష్ణయ్యనాయకుడిమీదనూ చెరి సగం.

తరువాత తంజావూరు.

---

(4) ... ఈమాటల్లో ఏమాత్రమూ సత్యము లేదని, అధునాతన- జావళీఖజానాదారులు :— వీణె ధనం, టైగర్ వరదాచారి ప్రభృతుల అభిప్రాయం.

పదము లంటే పాదము లని సరిపెట్టుకుంటేమాత్రం అట్టే తేడారాదు.

(5) ... వావిళ్ళవారు అచ్చువేసినగ్రంధంలో నూట ఏభైకి పైగా లేవు: (సంఖ్య రెండువందల దాకా ఉన్నా, మిగిలినవి అన్యకర్తృకములు: పోల్చుకోలేక సంకలనాధికారి భ్రమపడి ఉండవచ్చును.)

మూర్వేష్టి గుజిలీప్రతుల్లో ముద్రణదోషములు లేకుండా రెండున్నరవందలు, ఇంకా, అనోటా, అనోటా అన్నీ కలిసి మొత్తం,

విజయరాఘవరాయలు ఎదురేగి, తోడితెచ్చి సభను కలకలలాడించుకున్నాడు. కృష్ణరాయని అనంతరం ఆంధ్రకవితావధూటికి ఏడుగడ అయినవిజయరాఘవుని సాహచర్యం ఆచోట క్షేత్రయ చిరావాసానికి ముఖ్యకారణము అయింది.

రంగాజీ మొదట ఆమహాకవిని అధికంగా మన్నించి మురిసిపోయింది. ఆమె కనుసన్నలలో మెలిగే పండితపరిషత్తు, క్షేత్రయకు అగ్రపూజార్హతను ధారపోసింది. కాని క్రమంగా.... ...

స్త్రీసహజమైన చాంచల్యము కావచ్చును. మహారాజప్రేమైకనిధానమ నని, అపరభారతి నని గర్వము ప్రేరేచవచ్చును. మునుపటి వినయాదరములు సన్నగిల చేసుకున్నది. సర్వజ్ఞమూర్తి ఈదురుసుదనమును ఆదినే గమనించికూడా, చూడనట్లు ఊరుకున్నాడు. మహారాజూ, మిగతాపండితులూ, అసలు పసిపట్టనేలేదు.

మహారాణీని అతినిర్లక్ష్యంగా "ఏవనితల్ మముం దలప నేమిపనో తమరాడు వారు కారో" అని గదమాయించినసాహసి అని అందరికీ తెలిసినా, క్షేత్రయను చిన్నచూపుచూడగల తాహతు ఆమెకు ఉన్న దని ఎవరూ కలలో అయినా అనుకోలేదు.

ఒకప్రాతస్సమయం. వైతాళికులు ప్రాభాతగీతములను అప్పుడే చాలించినారు. రాజప్రాసాదాంతరము చైతన్యశబలితమై ఉన్నది.

సౌఖశాయనికుడుగా మహారాజుకు తాను, ఆతొలిరేయి పలికినపదములను వినిపించవలె నని క్షేత్రయ అంతఃపురములో హుటాహుటి శయనమందిరాన్ని సమీపించబోతున్నాడు.

ఇరుగడల సకియలు కైదండ లీయగా
విడజారు గొజ్జంగివిరిదండ జడతో ...
నిడుదకనుల దేరు నిదురమబ్బుతో ...

కేళీమందిరం విడిచి వస్తూన్న రంగాజీ - మోహనమూర్తి ఆమహానుభావుడికి సహితం అనిమేషస్థితి కలిగించినది.

తేలుకుని, చిరునగవుతో, ఆమెను పలుకరించాడు. కాని, ఆ ప్రసాదమాధు ర్యం చవిగొన నోచుకోనని రూపాజీవికా సామాన్యాపశబ్ద చ్ఛాయావిజృంభణం

రంగాజీవయ్యారానికి ఒకవింత నైసేత కావడమే క్షేత్రయకు నచ్చింది. మనోవీధిని భావనాచిత్రిన ర్తనం లాస్యించింది. ఆఆనందానుభూతి అవమానాన్ని రంగాజీ అవజ్ఞతను మరపించి కీర్తికామినికి సైదోడుతగులాటము కల్పించినది.

ఆమె తోవను తీవితో తరలిపోయింది. మహారాజు, అంతకుముందే మేల్కొని, గరడీలసాల ప్రవేశించినట్లు ప్రతీహారిణి విన్నవించింది.

అవధిని, ఉద్యానవిహారణంతో గడపి, వనపాలికలు అర్పించిన పుష్పోపహారములను అందుకొని క్షేత్రయ సభాభవనం ప్రవేశించినాడు.

పంచరత్నములను హాయిగా గానంచేసి సెహబాస్ అనిపించుకొని, పునః తీర్థయాత్రా ప్రవర్తనముకు అనుజ్ఞపొంది వెళ్ళిపోతూ—

'మగువ తన కేళికామందిరము వెడలెన్'

అనేపల్లవిని అందిచ్చి, తాను తిరిగివచ్చేలోపల - మూడుమాసములు - అక్కడివారిలో ఎవరైనా అనుపల్లవిని నిర్మించగలిగితే వేయిసన్మానముల పెట్టు అని, మనవిచేసి, మహారాజు సరేనని తల ఊపగా, ప్రయాణమైనాడు.

మూడు కాదు ఆరుమాసములనాటికి గరుడోత్సవమును దర్శించుటకు వచ్చిన విజయరాఘవభూపాలుని కంచిలో, క్షేత్రియ కలుసుకున్నాడు. సభ్యపరివారమంతా ఆయనవెంటనే ఉన్నది.

గోష్ఠీవశాన వెనుకటిపల్లవిసంగతి జ్ఞాపకం చేశాడు. మహారాజు సభ్యులను వీక్షించి హెచ్చరించాడు. వారు తెల్లపోయి, ఒకరి మొగం ఒకరు చూచుకొని ఊరుకున్నారు. క్షేత్రియ రంగాజీని చూపులతో ప్రశ్నించాడు. ఆమె తిరిగి చూడలేక, పరాజయాన్ని అంగీకరించి, సిగ్గుతో తల వంచుకున్నది.

అంత, మహారాజు ప్రాంజలియై వేడుకోగా, అతడు - క్షేత్రయ :

వగకాడ మాకంచివరద !

తెల్లవారె ననుచు ... ...

— అనుపల్లవిని పలికి, ఇంకా, మూడుచరణములలో నిత్యసన్నిహితంగా నిలిచిపోయిన రంగాజీ ఆనాడు కేళిమందిరము వెడలివచ్చునప్పటి విలాసాన్ని అద్భుతంగా వర్ణించాడు.

చేసినతప్పును కాయ మని అందరూ పాదానతు లైనారు. ఆపరమకారుణికుడు వారి అపరాధ మేమీ లేదనీ, మన్ననచేసి రంగాజీని విశేషించి మెచ్చుకుని, ఆమెకు పూజాస్థాన మైనాడు. (6)

తిరిగి వార్ధకదశలోనైనా క్షేత్రయ స్వదేశమునకు వచ్చినజాడలు లేవు. అంతట వానిని విడిచిపెట్టలేక పంతము వేసుకుని రసికప్రభువులు తమవద్దనే నిలిపికొని ఉండవచ్చు. (7)

జయదేవాదులు వాసుదేవుని దైవాంశను ఖాతిర్ చేసి రచనలు సాగించారు. క్షేత్రయ 'మువ్వగోపాలుని'కి చతుర్భుజములూ, చక్రాదిసాధనసంపత్తులూ లేవు. 'కంతుజనక !', 'పాకశాసనవినుత !', 'పరమాత్మా!' లాటివిశేషణములు, కేవలం ఔపచారికములు. గోపాలుడు, గో-పాలుడు కాడు : సూర్యసుతాపులిన విహార స్మరణం లేదు పదములలో ఎక్కడాను.

జర్మన్‌తత్త్వవేత్త 'నీచే'అభివర్ణించిన 'సూపర్‌మన్'హంశలు మువ్వగోపాలునిలో సిద్ధించినవి. దేవాదిదేవు డనీ ఆదిమూర్తి అనీ భక్తితో-పారమార్థికచింతతో-కాదు సుందరులు అందరూ ఎగబడినది ...

---

(6) ఈవిషయం వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిలవారు (కూచిపూడి భరతాభినయకోవిదులు) దక్షిణదేశంలో ఒకవృద్ధాచార్యునివలన విన్నట్లు చెప్పినారు. సాక్షికంగా గ్రంథస్థములు అయిన ఆధారములు లేవు.

విజయరాఘవునిసమక్షాన పరీక్షగా చెప్పింది ఈపదం కాదనినీ, క్షేత్రయ :

రామ రామ ఈమేనితో నిక వాని

మోము చూడవలెనా ...

మొదటిపొందే చాలు ...

— అని పాడి, పల్లవిని కల్పించమన్నా డనీ, అక్కడివారిచేత కాకపోగా

వదరక పోపోవే ... వా డేల

వచ్చీని వద్దు, రావ ద్దనవే ...

— పల్లవితో కాంభోజిలో పదమును తానే రచించినా డనీ కొందరిమతము.

(7)...పడుచుదనంలోనే రాజసభామర్యాదలు విహారములు తోసి, తిరిగి మొవ్వ వచ్చేవి సంపదలు అన్నీ గోపాలునికి అర్పించి, సాధువృత్తిని ఇష్టదైవమును కొలుచుకుంటూ, ఆలయప్రాకారంలోనే ఉనికి ఏర్పరచుకుని, శతవృద్ధుగా జీవయాత్ర చాలించినా డని కొందరు చెప్పుతుంటారు.

ఒకనాయిక గోపాలునికీర్తి విన్నది. దర్శనమునకు తహతహలాడిపోతూ చెలితో అంటూంది:

'నల్లని మేనివా డట...
నయము లెన్నో చేసు నట
చల్లగా మాటాడు నట
సరసము వానిసొ మ్మట
కల్లగా దట వాడు
కళ లంట నేర్చు నట...
ఎటువంటివాడే...

ఓయమ్మ! వా
డెన్నడు నీవీధిని రాడు
కుటిలకుంతల! మువ్వ
గోపాలు డట పేరు...
బంగారుమవ్వటివా డట...
అంగన లెందర నైన అలయక కూడు నట
సంగీతలోలు డట చాలా యీవిగా డట...'

చూడకముందు నోరూరగా, వినికిడిమెచ్చుకోలుకన్న అనుభవించి కరువు తీరని వయసుగత్తె పొగడికలలో ప్రత్యక్షసత్యము ఉన్నది.

మొలకనవ్వులవాడే, ముద్దుమాటలవాడే,
తళుకారు చెక్కుటద్దములవాడే
తలిరాకుజిగి దెగడ దగుమోవి గలవాడే...
చిరుతప్రాయమువాడే, చెలువొందు విదియచం
దురు గేరునొసలచే మెఱయువాడే
చెఱకువిల్తుని గన్నదొరవలె నున్నాడే
మెరుగుచామనచాయమే నమరువాడే ...
'పొదలు కెందామరపెం పొదవుపదములవాడే
కొదమసింగపునడుముకొమ రమరువాడే
మదకరికరముల మరపుచేతులవాడే
సుదతి! మువ్వగోపాలు డెంతసొగసు గలవాడే ...

అంతఅందగాణ్ణి తన్నుకుపోవా లని ఎందరో కాచుకుని ఉండటంలో వింత ఏము న్నదీ ? బయట తిరిగితే ' దిష్టి ' తగులుతుం దనీ, " పందె మాడుకున్నారట - పట్టుకపోయెద మనుచు : ఎందు దాచుకొందు నిన్ను " - ఈభయాలు గోపాలునికి ఏమీ లేవు. దక్కించుకున్న ప్రతినాయికా ఏకపత్నీవ్రతం అనుష్ఠించమనీ, తానే జాణను, పెరవా రందరూ మాయలమారు లనీ బతిమాలడం స్వాభావికమే కాని, ఆలా ఒకచోటనే కట్టుబడి కూర్చుంటే సంసారసమృద్ధి కలిగేది. కాని, రసిక మండలిలో ఎన్నిక ఎందుకు వచ్చేదీ !

ఇక గోపాలుని దినచర్య.

అందగత్తెలు అందరూ- జాబితా అతనికి తెలిసే ఉంటుంది గనుక ముందు ఏ లాగో స్నేహం చేసుకోవడం, తరువాత తన అభిప్రాయం తెలిపి ఒక్కొక్కప్పుడు నాయిక బెట్టుగా 'సదయుడ ! వద్దు. నేస్తమే చాలు' అంటుంది : కాని మనవాడు అంతటితో ఇంగితం గ్రహించకుండా వదలి ఊరుకునే అరసికుడు కాడుగా !

' ఆమాట వినక కాళ్ళవేళ్ళ పెనగుచు పదివేలబాసలుచేసి పాయజాలనని -

' మనసు తెలియవలసి
మాయింటికి రావద్దన్న
కనుగొన దిటవు లేక...

( దిటవు లేనిది నాయిక : తరువాత కాని తెలిసి రాదు )

' కన్నీరు నించి...
పెనగొన్నతమకాన పెదవులే తడుపుచు
నినుబాయలే నని...బతిమాలి...

' నీమాట నమ్మరా దోయి
నే చాలా కోపగత్తెను
ఏమన్న ఏమి వచ్చునో...
ఎందుకు ?'

— అనగా :

మోము చూచి...తన
మోహమే పూటకా పని
... కూడి ...

- కొత్తమోజుమీద అనుదినం రాకపోకలు సాగిస్తూ ఉంటాడు. నూతన ప్రియురాలుకూడా అతని 'కౌగిలే తన కిర వని...' ఉంటుంది; 'దైవం మారుగా' చూస్తుంది : 'ఊసిగంపుపడుచె మనసు లోకు టిగా' నిలుస్తుంది కాని ఎంతకాలం' అధీరుడు దారి తప్పినా డని తెలిసేదాకా...

క్రమంగా అటువేపు వెళ్ళడం మానివేస్తాడు. మరీ లోకువ అని తలస్తే తీరికగా ఉన్ననాడు ఉబుసుపోకకు అలా వెళ్ళి ఆమె ఎదుటనే నిష్ప్రేచీగా తనఅప్పటిజ్వాలను పొగడుకుంటూ, తలచుకుంటూ, మొగమాటాన బలవంతబ్రాహ్మణార్థంచేసి తప్పించుకు వస్తాడు.

మళ్లీ ఎన్నడైనా వస్తా డేమో నని ఎదురుచూసి, చూసి, నిలువలేక రాయబారం పంపుతుంది. కాని, 'కాయజుని తలిరుపదనుకత్తులు ఆచెలులు'. వాళ్ళను నమ్మడానికి వశమా ? - గోపాలునికి అందమైన దైతే చెలికత్తె అయినా అభ్యంతరం లేదు. (8) అందాకా కాదు, ఒకచెంప నాయికతో సఖ్యం చేస్తూనే ఆమె అడపగత్తెతో 'కోమలి ! నే నీడ నుండు కెల్ల నీకోస' మని మంతనము లాడుతూంటాడు నిర్భయంగా.

అంతటా ఇలా తేరదనమే కలిసిరాదు గోపాలునికి. 'ఇయ్యరానిబాస లిచ్చి' నమ్మించి 'అప్పగా' పిలిపించుకుంటాడు, కొందరు సామాన్యలను విటరాయడైనా ! కొంతకాలం ఆమాదిరిగా దర్జాను పురస్కరించుకుని 'ఖాతా' నడుస్తుంది కాని, కాసు చూపించకుండా ఎంతకాలం నెగ్గుకు రాగలడు ?

'తప్పునుద్దులకెల్ల నే తాళేదానను గాను...
నీతో వేగించిన నాసొమ్ము
అటపరించేది న్యాయమా !
మటుమాయలు చాలించు :
మా కియ్యవలసిన పైడి
అటు బెట్టి మాటలాడు ...'

అని నిలవేసి అడిగి వసూలు చేసుకుంటుంది. 'శ్రీనిధి' అయిన మువ్వగోపాలుడు కూడా డబ్బుకు ఇబ్బందిపడి వాయిదా వేయవలసిన అగత్యం ఉన్నా కలిగినప్పుడు మాత్రం చేతికి ఎముక కనపడనీయడు. కాని, అందరికీ ఆవిశ్వాసం ఉండదు.

(8) నాయకుడు పడుచుచెలికత్తెల విషయంలో చాపల్యం చూపించడం అసహజం కా దని, అమరుకుని 'నిశ్శేషచ్యుతచందనమ్' పద్యమే సాక్ష్యము.

'... నీ కన్నెరికమునకు కంఠసరు లిచ్చినది ...
రమ్మని మంచి
తేటముత్తెపుసరులు తీసుక గూడినది
మరచితివా - నన్ను మగువా ...'

'అహం భో' అని తెలియచెప్పుకోంటేనేగాని గోపాలునికి ఆహ్వానం కరువు, ఇక్కడ :

'వల్లవీమకరీచక్రి మకరాలయు' నకు సానివాడలోనే నిత్యనివాసం కాదు, వలచి ... ధన మేమీ కోరని వెలయాళ్లు ఎంద రున్నా ...

శైశవంలో ఆటపాటల్లో తోడుగా ఉండేవాసగత్తెలకు ఈబుద్ధులు నేర్పి ఈడేరినతరువాత కౌమారహారు డయ్యేవాడు. కొందరు పిల్లలు అతనిమీద మనసుపడి పిలువ నంపగానే సంతోషంతో పొంగిపోయేవారు ...

'ఎమ్మెకాడు నేను నెనసిన చిన్ననాడె
సమ్మతిగా నొకచోట చదువుచుండగా
పమ్మెనవేడుకతో - భామ, నీవు ప్రౌఢ నైతే
కమ్మవిల్తుని కేళి గలసే మన్నది నిజమై
... పిలువనంపె నన్నీవేళ - ప్రేమ మీరగా నిపుడు!

ఈలా 'బాలప్రాయమునాడే భ్రమియించి వాడేలినసుద్దులు ఎన్నెన్నో కలవు'. ఉభయులూ ఏకమనస్కులు గనుక ఇది ఫరవా లేదు : కాని అథం శుభం ఎరుగని అమాయకురాలిని 'చిన్ననాటినేస్తము చెరిచి మన్నించు మని బ్రతిమాలి బలిమిబట్టి' ఆమె 'బ్రతుకు పలుచన' చేయడం న్యాయమా? వాళ్ళ 'వారు ఎరిగితే ఇలు చేరనీయరు కదా!' - కలకాలము ఎవరికిని కానిది అయిపోవడమేనా?

ఇంత కన్నా ...

'పురుషు డూరలేనిప్రొద్దు మాపటివేళ వచ్చి దిటవుగా ఇలు సొచ్చి కొన్న మగనివలె కొంగు బట్టి యీడ్చి' మగనాలిని రవ్వజేసి పోయినది ఎవరో? ...

ఎవరో, ఆదివరాహుడు, కంచివరదుడు, వేదనారాయణుడు, తిల్లై గోవిందరాజు, పాలగిరి చెన్నుడు, యదుగిరిరాయడు, తిరుత్తనివాసుడు, మధురాపురీశుడు. వీ రందరినీ రసికులనుగా మార్చినమాంత్రికుడు ఎవరో? క్షేత్రియ దివ్యవాణీలాలనతో, నవనవోదయ రాగసుధామరీచులనేస లమరించుకుని నిత్య కల్యాణుడై మోహనమోహినీలోకమును మధురించిన కిశోరమూర్తి? ...

మువ్వ గోపాలుడు ...

# ప్రభువాక్యము

శ్రీ శివశంకర శాస్త్రి

*

అంకితము

శ్రీ బుర్రా శేషగిరిరాయ ప్రధానికి

*

౧

మహామాత్యభవనము

ప్రతీహారి

జయము జయము మహామాత్య
సత్తమునకు ! పాదదాసి
అధికభక్తితో ప్రణామ
మాచరించి, విజ్ఞాపన
సవినయముగ చేయనున్న(ది) !

మహామాత్యుడు

ఇపుడు వచ్చితి వేమి
ఈతొట్రుపా టేమి
ఆకస్మికమ్ముగా
అహిత ముదయించెనా ?

ప్రతీహారి

అనుకంప వహించి హాఠా
దాగమనము క్షమియింపుడు !
కాంచీరాజకుమారిక
గాఢశోకతప్తరాలు
దగ్ధనార్థ మరుగుదెంచి
ద్వారముకడ నిలుచున్నది.
ఆసతి యగునేని యామె
నాహ్వానించెద లోనికి.

మహామాత్యుడు

ఏల చెప్పగవైతి
వీమాట తొలుదొల్త ?

...          ...

కాంచీకుమారి, రా
గదవమ్మ లోపలికి !

ప్రతీహారి

చేయక తప్పద పెండిలి
శ్రీమద్రాజకుమారికి
ఈనాడే ? - కొంతకాల
మెట్టులైన గడచు నెడల
ప్రభునకు కనికరము కల్గి
పట్టుదలను విడుచునేమొ.

మహామాత్యుడు

ఉత్కలేశ్వరుడు తా
నొసగి యానతి తొలుత

అన్యథా చేసెనా
అవల నెన్నడు గాని?
కనికరంబు జనింప
కారణం బీనాడు
కలిగెనా ఆకస్మి -
కమ్ముగా నేదేని?

ప్రతీహారి

కాలము గడచిన కొలదిని
కరగ వచ్చు ప్రభుని మనసు
దర్శన మొసగిన పిమ్మట
దయసైతము కలుగవచ్చు.
దండనమున కైన గాని
దయచూపుట కైన గాని
ధరణీధవులు సమర్థులు.

మహామాత్యుడు

పురుషోత్తమదేవ మహా -
భూమీపతి యద్వితీయ
చండశాసనుం, డానతి
జనులకు సుగ్రీవాజ్ఞయె.
కాంచీనాయకులు తిర-
స్కారము చూపించినార
లస్మత్ప్రభునకు : కావున
ఆగ్రహించినాడు రేడు.

రాజకుమారి

ఒకమాట మాత్రాని
కుత్కలేశ్వరు డింత
కాఠిన్య మూన దగునా?
ఎందైన
కార్య మిట్టిది కంటిమా!

మాట అన్నందుకే
మారాజ్యము జయించి
సాధించి వచ్చె గాదా?
ఇకనైన
శపథమ్ము విడువరాదా!
మాతండ్రి తన నేమి
మాట లన్నా డనుచు
నను బట్టుకొని వచ్చునా?
ఇది మీరు
న్యాయ మనుకోవచ్చునా!

మహామాత్యుడు

ప్రభువు కఠినుడు కాడు
పరమకారుణికుండు
సరసుండు, శరణన్న
శత్రువున్ క్షమియించు
చండశాసను డయ్యు
శత్రుభీకరు డయ్యు.
మనుజనాయకు లెల్ల
మాటపట్టింపు చే
ఎంత లెంతలో చేతు:
రిది క్షత్రియుల రీతి.
ఉత్తమ క్షత్రియుం
డుత్కలేశ్వరుడు నీ
మీది ప్రేముడి చేత
మీతండ్రి నర్థింప,
తోడనే యతడు సం
తోషపూర్వకముగా
నిను సమర్పించి పా -
ణిగ్రహణోత్సవం

బొనరింప వలె ననుట
యుక్త మౌనా కాద ?
నీతండ్రి యటు చేయ
నేర కుత్కల నేత
క్షత్రియుండే యైన
సమ్మార్జకుం డనియు
తనకులము స్వచ్ఛమని
తనయ నీయ నటంచు
అవహేళనముచేయు
టనుచితం బనవేమి !

రాజకుమారి

సమ్మార్జకుం డంట
చాలదోషమె. కాన
అన్నదానికి ఫలము
అనుభవించెను కాద
మాతండ్రి !
జనకుమాటకు తనూ -
జాత నిటు శిక్షింప,
మీవంటి సజ్జనుల్
మెచ్చుకోదగినదా
చెప్పండి !

మహామాత్యుడు

పితరుల మాటకు
బిడ్డలు బాధలు
పడుదురు తల్లీ,
ప్రపంచకములో !
అందులకే మా
యవనీధవు డనె
సమ్మార్జకునకె
జాయ వగుదు వని.

ఇది న్యాయంబని
యెవ్వ రనరు. మరి
జనపతిమాత్రము
చండశాసనుడు !

రాజకుమారి

తనయెడభక్తియు
తాత్పర్యము గల
అబలమీదనా
ఆగ్రహ మూనుట !
నిజముగ నాపై
నెనరే యాదిని
ఉత్కలేశ్వరున
కున్న పక్షమున -
కైవస మగు మా
కాంచీపురిలో
పెండ్లియాడడా
పృథివీపతి నను ?

మహామాత్యుడు

ఉండెను తల్లీ,
ఉత్కలేశునకు
నీపై ప్రేముడి
నిండుగ నాదిని.
చక్కదనంబును
సద్గుణ వర్ణన
మాలకించి రే
డనురక్తుం డయి -
నిన్నుగూర్చియే
నిరతము నాలో

సంభాషించెను
చాల దినంబులు.

రాజకుమారి

అంత ప్రేమ మంతలోనె
అంతరించి పోయె నెట్లు!
అనురాగము కన్న నృపతి
కభిమానము ముఖ్య మాయె.

ప్రతీహారి

ప్రభుపాదంబులపై బడి
ప్రార్థించిన లాభ మేమొ.
మనసు కరుగదా యేనికి
మగువదీనవాక్కు విన్న!

రాజకుమారి

కనికరమున నృపతి నన్ను
కన్నియగా విడుచునేని
ఏకామ్రేశ్వరు గొల్చుచు
ఈజన్మము గడపుదాన!

మహామాత్యుడు

త్వరలో అన్నాడు, కాని
తప్పదు రాజాజ్ఞ తల్లి!
నీ వెరుగవు రే డెంతటి
నిశ్చలుండొ మాటపట్ల.

రాజకుమారి

కన్యగా జన్మంబు
గడప వీలే లేద?
సమ్రాజ్ఞకున కేను
జాయ కావలయునా?

అక్కటకటా! యెంత
అన్యాయ మన్యాయ
మాత్మహత్యకుగూడ
అయుధము లేదాయె!
కంచి కామాక్షమ్మ
కరుణించదా నన్ను!
ఏకామ్రనాథునకు
ఏమి దయ కలుగదా!
కైలాసనాథునకు
కారుణ్యమే లేద!
కాంచీకుమారి కీ
గతి పట్టనలసినద!

మహామాత్యుడు

ఏడ్వ కమ్మా! ఇప్పు
డేమి చేయుదు నేను?
దుఃఖ మెరుగుదు: నాకు
దుహిత లున్నారమ్మ!
ప్రభు వుంచినాడు నీ
పరిణయము కావించు
ప్రబలబాధ్యతను నా
పైన రాజకుమారి!

రాజకుమారి

ఈయాపదనుండి నన్ను
ఎట్టులైన రక్షింపుడు!
తండ్రి, ఈదీనురాలి
తనయగా భావింపుడు!
ప్రణమిల్లితి తావకీన
పాదాంభోరుహములపై
అభయ మిచ్చువరకు తండ్రి,
అడుగులు విడువంజాలను!

బ్రాహ్మణపుంగవ, లఖిల
ప్రజ్ఞలు మీకరగతములు
కనికర ముదయించిన నను
కాపాడుట సుకరం బగు.

ఆలోచించినచో నీ
యాపద తప్పించుటకై
మహామంత్రు లైన మీకు
మార్గము దొరకక పోవున !
దుర్గతి అదృష్టవశమున
తొలగిపోవునని నేడు
అమరణము మీ కృతజ్ఞు
రాలనుగా నుందు తండ్రి !
రక్షింపుము రక్షింపుము !
రాజకుమారిక అయోధ్యా
సమ్రాజ్ఞకునకు నేవిధి
జాయగ జీవింపగలను !

మహామాత్యుడు

ఏడువకమ్మా
యేడువకు !
పెద్దభారమే
పెట్టితి వమ్మా.
కానీ, చూతము
కాగల దేదో.
ఉర్వీపతి పురు -
షోత్తమ దేవుడు
కఠినమానసుడు
కాడు కుమారీ !
అదె ధైర్యంబున
కాధారం బగు.

దుస్సాధమే యైన
తోచుచున్నది యొకటి.
నీకు ద్వేషము లేదు
నృపతియెడ నని తలతు.
శీఘ్రకాలములోన
శ్రీమజ్జగన్నాథు
కారుణ్యమున నీకు
కల్యాణ మగుగాక !




౨

## జగన్నాథాలయము

మహామాత్యుడు

మహాప్రభూ, జయము జయము !

రాజు

మహామాత్యా, వందనంబు !

మహామాత్యుడు

స్వామిసేవయందు ప్రభువు
చాలమగ్ను లైనవారు.

రాజు

ఎల్లవారు సేవకులే
ఈమహాప్రభునియెదుట.
గౌడకో కళింగమునకో
కాంచికో ఉత్కలముకో
స్వల్పభాగములకు ప్రభులు
చాలమంది కలరు. కాని

సకలలోకములకు ప్రభువు
జగన్నాథదేవు డొకడె !

మహామాత్యుడు

తమకు గల్గు భావ మితర
ధరణిపతుల కుండునేని
ఈలోకము స్వర్గమువలె
ఎన్నడో మారియుండు.

రా జు

స్వామి సేవలోన ఎంత
సౌఖ్యమున్న, దీధరణీ
పాలనమ్మువలన నాకు
ప్రతిదినమ్ము జగన్నాథ -
దేవకైంకర్యమునకు
తెరపి లేదు మహామాత్య !

మహామాత్యుడు

నహచు ధర్మదేవత తన
నాల్గుపాదాలతోడ
ఈయుత్కలరాష్ట్రమందు
వెలికగా నుండ తమరు.

రా జు

పరశురామాది మహా
బ్రాహ్మణవీరులు పూర్వము
పృథివి యెల్ల గెలిచి, మట్టి
పెళ్ళవోలె, నిర్మములై
దాన మిచ్చి ముదముతోడ
తపమునకై వెడలినారు.

ఈకలికాలపభావ
మేమి చెప్ప ! ఇంచుకంత
మహి నేలెడి రాజు లెంతో
మదించి వర్తింతు రవుర !

మహామాత్యుడు

కావుననే రాజర్షులు
కావలె ధరణీకాంతులు.

రా జు

ఏడాదికి నొక్కనాడు
ఈ నీలాచలతీర్థ
ప్రభు జగన్నాథాలయ
ప్రాంగణపవిత్రభూమిని
గొప్ప లుజ్జగించి అన్ని
కులములవా రధిక భక్తి -
సర్వము జగన్నాథ మన్న
సరససూక్తి కనుగుణముగ -
ప్రసాదంబు స్వీకరించి
పవిత్రు లగుచున్నవారు !
ఎంతపూత వాసరంబు !
ఎంతశుభద వాసరంబు !

మహామాత్యుడు

శ్రీమ జ్జగన్నాథ
సేవానురక్తులౌ
దేవరవారి కీ
దివ్యప్రదేశాన
గొప్ప కానుక నొసగ
గొని వచ్చియున్నాను.

భూసురాశీర్వాద
పూర్వకంబుగ దేవ,
శ్రీ సన్నిధానాన
స్వీకరింపుడు దాని.

రా జు

మావృద్ధి కాంక్షించు
మంత్రివర్యులు మీరు
బ్రాహ్మణోత్తములు మీ
పల్కు లాదరముతో
శిరసా వహించి నే
స్వీకరించితి కాన్క !

మహామాత్యుడు

[ సంజ్ఞచే సమీపించిన రాజకుమారిని
నిర్దేశించును. ఆమె వినత యగును. ]

తమయెడ భక్తితాత్పర్యముల్ కలిగి
రాణికి నుచితమా రమణీయ సకల
శుభలక్షణాలతో శోభిలు కన్య
నాదరింపుం డుత్కలావనీరమణ !

రా జు

కనకంపుబొమ్మయే కానుక యనుచు
భావింపగా నైతి ప్రమదంబు ! కాని
ఇంచుక వివరింపు డెవ్వరో యీమె.

మహామాత్యుడు

కాంచీకుమారి యీ కన్యాలలామ
ముత్కళేశ్వరసేవనోద్రిక్తహృదయ,

రా జు

వెనుకటి మాయాజ్ఞప్తికి
విపరీతముగా మీరలు
చేయ దలచినారు. మిగుల
చిత్రముగా నున్న దండి !
ఈమెను సమ్మార్జకునకు
ఇచ్చి వివాహము చేయగ
వెనుక నాజ్ఞయిచ్చినాము :
విస్మరించినారో దాని !

మహామాత్యుడు

మహాప్రభూ తమయానతి
మరవ నెవ్వారితరము !
ప్రభువాక్యము అక్షరశః
పాలింపగ వచ్చినాను.
అధిపశ్రేష్ఠులు తప్పరు
ఆడినవాక్యము లెన్నడు.

రా జు

అధిపతి ఇచ్చిన యానతి
నన్యథా చేయరాదు.

మహామాత్యుడు

చిత్తము ! కావున దేవర
స్వీకరించి తీరవలయు
కాంచీరాజకుమారిని,
కాపాడుకొన ప్రతిజ్ఞ.
స్వర్ణదండ మండితమా
సమ్మార్జనితో దేవర
స్వామియూడిగంబు సేయు
సమయము కాదా ఇయ్యది !

రా జు

[ చేతులుజోడించి, మందహాసముతో ]

మహానీయము భూదేవా
మాత్య బుద్ధికౌశలంబు!

మహామాత్యుడు

మహాప్రభువు సరసహృదియె
మహానీయము మహానీయము!

రా జు

కాంచీరాజకుమారిని
గౌరవంబుతో సువర్ణ -
పల్యంకిక గొనిపోవుడు
ప్రాసాదమునకు వేగమె.

[ హర్షధ్వానాలు ]

మహామాత్యుడు

శ్రీ పురుషోత్తమ దేవ -
క్షితిపాలాగ్రణికి జయము!
జగన్నాథ మహాస్వామికి
జయము జయము జయము జయము!
జయము జయము జయము జయము!

స మా ప్త ము

*

## ధిక్!

విశ్వనాథ సత్యనారాయణ

స్నానమాడక మైలవస్త్రమ్ము కట్టి
అతడు కులహీను చేయన్న మారగించె
అతని సవర్ణులెల్ల ధిక్కని రవర్ణు
లెల్లరు విశాలభావ సౌహిత్యు డనిరి.

సంఘమున్ కట్టుబాట్లకు స్వస్తిచెప్పి
వాడు కామపరాయణత్వమున మెలగె
అతని గృహస్థులెల్ల ధిక్కని రపార
బాధగాథ వాంఛు లదృష్టవంతు డనిరి.

లాయకీ మాలి నైచ్యములకు చొరబడి
అతడు ధనముకూర్చి జగత్ప్రభుత వహించె
అతని బాంధవులెల్ల ధిక్కనిరి జగము
జనులు మిగుల నిర్వాహకుడని పొగడిరి.

# మాట పట్టింపు

( ఏకాంక రూపిక )

ఆమంచర్ల గోపాల రావు

దట్టంగా పెరిగిన అడవి. మధ్యలో కుటీరం. ఎదురుగా రెండుమూడు గజాలస్థలం బాగుచేసి ఉంటుంది. నరికిన చెట్లమొదళ్ళు రెండు పైకి కనిపిస్తూ ఉంటవి. కుటీరంవాకిలి ముందు సుద్దతో పెట్టినముగ్గులు కొంచెం చెరిగిపోయి ఉంటవి.

సాయంకాలం. రాగివర్ణంతో నిప్పులాగ అడివి అంతా నిగనిగలాడుతూ ఉంటుంది.

అర్జునుడు అంబులకు ఈకలు కట్టుతూ, సన్నగా రాగం తీస్తూ చెట్టుమొదట కూర్చుని ఉంటాడు. పక్కన కొన్ని యీకలు పడిఉంటవి; కొన్నింటిమీద రాయి బరువుపెట్టి ఉంటుంది.

అర్జునుడిజుట్టు చెదిరి ఉంటుంది. మొనలు తేలినమీసాలు, కొంత పెరిగినగడ్డం, మెడలో రెండుహారాలు. పులితోలుచడ్డీ తొడిగినాడు. కాళ్ళకు మోటుచెప్పులు.

పంటగదితలుపు తీసి ఉంటుంది. లోపల కుంతి విచారంగా కూచుని ఉన్నది. టెంకాయ చిప్పలు, ఆకుదొన్నెలు సమీపంలో పెట్టిఉన్నవి. కూనిరాగం తీస్తున్న అర్జునుడు క్రమేణా పాటలోకి దిగుతాడు.

కుంతి : [లేవకుండానే] అర్జునా! [పాటలో తన్మయుడైనఅర్జునుడు వినిపించుకోడు. ఆమె మరింత గట్టిగా] నాయనా! అర్జునా!

అర్జునుడు : [ఉలికిపాటుతో తల్లిని చూచి] అమ్మా, పిలిచావా?

కుంతి : ఏమిటిరా నాయనా, ఆపాట!

అ : ఏమీ లేదమ్మా...ఏదో ఖులాసాగా ఉండడంచేత కొత్త రాగం ఆలాపన చేసుకొంటున్నాను.

[కుంతి ఇవతలికి వస్తుంది. 50 ఏళ్లు. తల నెరిసినా రాజఠీవి తగ్గలేదు. కాని విచారంచేత ముఖం కొంచెం వన్నె తగ్గి ఉంటుంది.]

కుంతి : [విషాదంతో నవ్వుతూ] ఖులాసా! ఖులాసా! ఏమిమాట! నీ మొఖం ఖులాసా!

అ : ఏమిటమ్మా!

కుంతి : మనకు ఊరూ లేదు, ఇల్లూ లేదు, వాకిలీ లేదు. ఏపూట కాపూట తిండి దొరకడానికి కటకట లవుతున్నవి. ఇంకా ఖులాసాయేమిటి నాయనా! [నిట్టూర్పు విడుస్తుంది]

అ : [చిరునవ్వుతో] ఊళ్లోనూ, ఇంట్లోనూ ఉంటుందా ఖులాసా? తిండి దొరికితేనేనా సుఖం!

కుంతి : మరెక్కడు కుటుంబం దలా అయితే? దిగ్విజయం చేశారు నాపుత్రులు. సామ్రాజ్యం ఏలారు. అక్షౌహిణీలు నడిపించారు. సకల దానధర్మాలు చేశారు. అద్వితీయ పరాక్రమ సంపన్నులనే పేరుప్రతిష్ఠలు సంపాదించారు. దేవమానవుల మెప్పులు పొందారు. కాని [కాస్తసేపు ఆగి] కాని... కాని ... పాపిష్టి కర్మ! అడవులపాలయినారు!... [నిట్టూర్పు విడుస్తుంది. బాష్పబిందువు రాలుతుంది]. వేటాడితే తిండి, లేకపోతే పస్తు! నేలే హంసతూలికాతల్ప మయింది. వృక్షాలే రక్షభటు లయినవి. పక్షిజాతులే వందిమాగధులు. ఈ

కుటీరమే ప్రబలదుర్గం! ఘోరారణ్యసంచారం చేసేవృగాలే ప్రజలు. అబ్బా! ఏమి అదృష్టం! ఏమి హాయి, ఏమి ఖులాసా! [నిట్టూర్పు విడుస్తుంది.]

అ : [లేచి పెద్దపెట్టున నవ్వుతాడు. కుంతి విషాదంతో అతనివంక చూస్తుంది. అర్జునుడు నవ్వు తెటాలున ఆపుకొని చిరునవ్వుతో] నీవు కూడా ఇలా అంటూ వేమమ్మా! మన కివి కష్టాలా? గుండె దిట్టంగా వుంటే కష్టా లనేవి వుంటాయా? మీద రాళ్లు పడితే బకవుకు కొండ వంగుతుందా? ఏమి టామాటలు! [నవ్వి] రాజ్యాలు లేకపోవచ్చు. కాని ఒకరికి లోబడి ఉన్నామా? ఒకరికి వెరుస్తామా? మనను ఎవరన్నా అడ్డగలరా? ఇపుడుమాత్రం శిష్టరక్షణ చెయ్యమా? దుష్టశిక్షణ చెయ్యమా? అక్షౌహిణీలు లేవు పరివారం లేదు. అయితే ఏం? ఉత్సాహం ఉన్నది, బలం ఉన్నది, ధైర్యం ఉన్నది. ఎందుకమ్మా, మనకు విచారం? అన్ని వేళలా ఆనందమే.

కుంతి : [వికాసంతో] నిజం నాయనా, నిజం! ఒళ్లు మరిపించేలాగ తియ్యటి పాట ఒకటి పాడు.

[అర్జునుడు ఆపినచోట పాట అందుకొని పాడుతాడు. ఎవరో వడిగా పరుగెత్తుకు వస్తున్నట్టు వినబడుతుంది. ఇద్దరూ చప్పుడు ఆలకిస్తారు. క్షణం నిశ్శబ్దం.]

కుంతి [మెల్లిగా] ఎవ రది?

అ : ఏమో.

కుంతి : అబ్బాయిలకు ఏమీ కష్టం కలగ లేదుగద! ఇవాళ ద్రౌపదిని వెంట తీసుకు వెళ్ళారు.

అ : ఎవ రాపరుగెత్తుకు వచ్చేది!

కుంతి : ఎవరో. దుర్వార్త తీసుకు రారు కద! అయినా ఇంత ఆలస్య మెందుకయిందో. రోజూ ఈపాటికి వచ్చేవాళ్లే. చీకటికూడా పడుతున్నది.

అ : ఎందుకమ్మా, ఇంతభయం. సలక్షణంగా అంతా ఇంటికి వస్తారు. చూడు.

కుంతి : కాదురా నాయనా. ఆవచ్చేవాడు ఏదో దుర్వార్త తెస్తాడు. ఎందుచేతనో... నా కలా అనిపిస్తున్నది.

అ : ఎందు కమ్మా, అనవసరంగా అందో ళన పడతావు! చూడు... ఆవచ్చేవాడు... ఎంతవేగం...

కుంతి : పట్టుబట్టలు కట్టుకొన్నాడు.

అ : అవును. మనవా డెందుకవుతాడు?

కుంతి : అవు నవును... ఇటే వచ్చేశాడు...

[తత్తరపాటుతో పెద్దపెద్దఅంగలు వేసుకొంటూ గయుడు ప్రవేశిస్తాడు. అతను కుండలును కొంచెం జప్తిక తెస్తాడు.]

అ : ఏమిది!

కుంతి : భయపడి పరుగెత్తుకువచ్చినట్టు కనిపిస్తాడు. [లోపలికి వెళ్ళుతూ] దివ్వెలు వెలిగించు నాయనా! చీకటి పడుతున్నది.

[అర్జునుడు ప్రమిదలు వెలిగిస్తాడు. కుంతి నీళ్లు తెస్తుంది. గయుడు తికమకలో తల్లీకొడుకులను ఎగాదిగా చూస్తాడు.]

కుంతి : ఏమినాయనా! అంత అడావుడి పడుతున్నారు? [గయుడు మాట్లాడక, వణుకుతూ అర్జునుడివంక చూస్తాడు] ఎందుకు బాబూ, భయపడతారు?

గయుడు : భయ మేమి టమ్మా, ప్రాణం మీదికి వచ్చినప్పుడు!

అ : ఎందు కయ్యా, అంతభయం?

గయు : భయమా... ప్రాణం తియ్యడానికి వెనుకనుంచి తరుముకు వస్తుంటే... ఊరికే భయమనుకున్నావా!... వెళ్లాలి...వెళ్లాలి... [వెళ్ళబోతూ ఉంటే అర్జునుడు అతన్ని రెట్ట పట్టుకొని ఆపుతాడు. అతను వణుకుతాడు] పోవాలి విడు, విడు.

అ : ఎక్కడికి పోతావు?

గ : ఆ దంతా నీ కెందుకు? [ లేరిపార జూచి ] నీవు వాళ్లమనిషివా యేమిటి! ... నన్ను వాళ్లకు పట్టిస్తావా యేమిటి?... అయిపోయింది! [ చతికిలబడతాడు. ]

అ : నీకేమైనా మతి ఉందా- ఎవరిమనిషివీ కావంటూవుంటే! శాంతించు... నీప్రాణాలకు నాప్రాణం అడ్డం వేస్తాను— అవసరమైతే...

గ : నీప్రాణం అడ్డంవేస్తావా ? [ఆశతో] రక్షిస్తావా! వాడిసంగతి తెలియక అంటున్నావు. మనలాంటివాళ్ళను పదిమందిని ...

అ : [ జేవురించినముఖముతో ] మనలాంటివాళ్ళను... పదిమందిని... హాహా! [ నవ్వి ] అంతధీరుడనవయ్యా... ఈలోకంలో! నేను రక్షిస్తానన్నమనిషిమీద చెయ్యివేసే సాహసం గలవాణ్ణి చూడవలసి ఉంది!

కుంతి : అవును నాయనా!

గ : [ వెర్రినవ్వుతో ] ఎంగుకయ్యా, ఈ ప్రగల్భాలు! నీవూ, ఈముసలమ్మా.. మంచి మాట... వాళ్ళు రాగానే నన్ను తక్షణం అప్పజెప్పి, ప్రతిదానికి చిత్తం చిత్తం అంటారు. చాలులెండి. వెళతా [ లేస్తాడు ]

కుం : మాసంగతి బొత్తుగా తెలియకుండా మాట్లాడుతున్నారు. మా అబ్బాయి మాట యిచ్చాడంటే...

గ : [ విశ్వాసముతో ] ఎవరమ్మా మీరు?

కుం : నన్ను కుంతీదేవి అంటారు [గయుడు పెద్దపెట్టున నవ్వుతాడు] వాడు మాఅబ్బాయి అర్జునుడు...

గ : చాలులెండి! కుంతీదేవి విదురుడి యింట్లో వుంటే ...

అ : ఈవిడ మాఅమ్మ కుంతి. మమ్మలని చూచిపోవడానికి వచ్చింది.

గ : [ఆశ్చర్యంతో] అయితే మీరు అర్జునుడన్నమాట! [ అర్జునుడు తల ఊపుతాడు ] ఏమి అదృష్టం! బతికా నన్నమాటే. [ తటాలున వంగి అర్జునుడి మోకాళ్ళు రెండుచేతులతో పట్టుకొని] క్షమించాలి...రక్షించాలి...

అ : లేవండిక. చెప్పానుగా.

కుంతి : లెండి, సేదతీర్చుకోండి.

[ గయుడు లేస్తాడు. కాని ఇంకా సందేహం అతని ముఖాన కనబడుతుంది. ]

కుంతి : ఇంకా సందేహమా? రక్షిస్తానన్నాడే మాఅబ్బాయి అర్జునుడు.

గ : [తటపటాయిస్తూ] మ రేమీ లేదు కాని ...

కుంతి : కాని ...

అ : సంశయంతో పని లేదు.

గ : ఆవచ్చేవాడి తేనెమాటలకు లోబడి...

కుంతి : [నవ్వి] మ రేమీ భయం లేదు. ఒకసారి ఏదైనా అంటే మావాడు ...

గ : సరి, సరి, అయితే మిగిలిన అన్నదమ్ముల అభిప్రాయం ఎలా ఉంటుందో అని ...

కుంతి : ఒకపాండవుడిమాట పంచపాండవుల మాటే. ఆపైన నేనుకూడా చెపుతున్నాను కాదూ? ... తెలిసిందా?

అ : [అమ్ము తీసి పరీక్షిస్తూ] సేద తీర్చుకొని సావకాశంగానే చెప్పండి. ముందు ఫలాహారం కానివ్వండి.

కుం : అయ్యో, అతిథిసత్కారం మరచిపోయి నాను నాయనా. వంటసంగతికూడా మరిచాను. కొంచెం ఉండండి. [కుటీరం లోపలికి వెళుతుంది. అర్జునుడు గయుడివంక పరిశీలనదృష్టితో చూస్తాడు. అతను ఆలోచనామగ్నుడయి ఉంటాడు.]

అ : మీ కింక భయము అక్కరలేదు. అనవసర మయిన ఆలోచనతో బాధ పడవద్దు. మాయింటికి అతిథి వైనతరువాత నీమీద దోమ వాలనిస్తామా?

కుంతి : [పండ్లు, జలము, తీసుకువచ్చి కింద పెట్టి[ఈపండ్లు తిను నాయనా, యీజలం తాగు, యథాశక్తిగదా అతిథిసత్కారం! లోపాలు ఏమి ఉన్నా ... క్షమించి... ముందు ఇవి పుచ్చుకో. ఇంకా భయం ఎందుకు నాయనా

నీకు? [కొడుకుతో] వేటనుండి తప్పించుకున్న లేడిలాగ, యింకా వణుకుతున్నాడే? [గయుడితో] శాంతించు నాయనా!

[గయుడు ఒక చెట్టుమొదలుమీద కూర్చొని పండొకటి ఒలవడం మొదలుపెట్టాడు]

అ: ఇక మొదలుపెట్టవచ్చు. మీ రెవరు?

కుంతి: మొదట ఆయనను సావకాశంగా ఫలహారం చెయ్యనీ. పాపం బెదిరిపోయినాడు!

గ: పర్వా లేదులెండి. అయ్యా, నన్ను గయుడంటారు. నేను గంధర్వరాజును. ఇవ్వాళ ప్రొద్దున ---

[హఠాత్తుగా పెద్ద అట్టహాసము వినబడుతుంది. కొంతమంది వస్తున్న కాలిచప్పుడు వినబడుతుంది. గయుడు ఉలికిపడి ఎగిరి నిలుచుంటాడు]

కుంతి: అవచ్చేది మా అబ్బాయిలు లే నాయనా

అ: [కష్టంమీద నవ్వాపుకొని] ఆ నవ్వు మా అన్న భీముడిది. ఆయన నిష్కల్మష హృదయాన్ని సూచిస్తుంది. ఆ నవ్వునల్లే ఆతని వైరుల హృదయాలు బద్దలయిపోతయి, స్నేహితుల హృదయాలు పొంగిపోతయి. ఆయనతో స్నేహమయినా సరే విరోధమయినా సరే చాలా కష్టం.

గ: [అనుమానం తీరినముఖంతో పండు తింటూ] ఆయన స్నేహితులకు ఎందుకు కష్టం?

అ: [చిరునవ్వుతో] స్నేహితుడితో ఆయన సరసం జాస్తి. పైన చెయ్యి వేస్తే వారం రోజులు... స్నేహంలో గట్టిగా చరిచాడో... [నవ్వుతాడు]

గ: మీ నవ్వూ అలాగే వుంది.

కుంతి: అందరి నవ్వులూ వాలకాలూ ఇంచుమించుగా ఒకటే నాయనా... ఇంకో పండు పుచ్చుకోవూ?

[పెద్దపెట్టున నవ్వుతూ చేతులు విసురుకుంటూ విరగబడుతూ ప్రవేశిస్తాడు భీముడు. అతని ముఖం అర్జునుడి ముఖంకంటె వెడల్పుగాను, పెదవులు ఇంకా కొంచెం లావుగాను ఉంటవి. మెలివేసిన పెద్దమీసాలు. చెడ్డీ చెప్పులు భుజంమీదికి వల్లెవాటుగా వేసిన పులితోలు. వస్తూనే విల్లు అమ్ములు ఒకమూల పడవేస్తాడు.]

కుంతి: ఎందుకబ్బాయి అంత నవ్వు?

[తక్కిన పాండవులూ ద్రౌపదీ ప్రవేశిస్తారు. ఆవిడ జుట్టు విరబోసుకొని ఉంటుంది.]

భీముడు: ఏముంది, యీ వాళ వేటలో ఏమీ దొరకలేదు. [నవ్వుతాడు]

నకులుడు: [కోపంతో ముందుకు చరచరా వచ్చి] అవును, ఎందుకు దొరుకుతుంది! నీవూ ద్రౌపదీ వస్తే దొరకడం కూడాను!

కుంతి: అదేమిట్రా అబ్బాయి!

సహదేవుడు: ఏమిటా, ఎప్పుడూ ద్రౌపదితో ఏదో మాట్లాడుతూ పెద్దపెట్టున నవ్వుతూ వుంటే... జంతువులు దగ్గరికి రావూ పాపం!

కుంతి: అలాగా.

నకు: ఈపూట తిండో?

సహ: ఏమయినా ఖర్మం చాలక తెస్తే సగానికి పైగా భీముడికే...

కుంతి: పోనీలెండ్రా. ఒకపూటకు లేకపోతే నేం? ఇవ్వాళ మనయింటికి అతిథి వచ్చాడు: గయుడు, గంధర్వరాజు ఏవో చిక్కుల్లో వున్నట్టున్నాడు. మనవా డభయ మిచ్చినా ఆయన శాంతించడం లేదు.

భీముడు: మనయింటికి వచ్చాక ఇంకా భయం ఎందుకు? హస్తినాపురదుర్గంలో కన్న వెయ్యిరెట్లు క్షేమం. ఏడీ ఆయన [ఇటు అటూ చూచి] ఇడుగో. [గయుడి దగ్గరకు వెళ్ళి పక్కన రాతిమీద కూర్చుంటాడు.]

యుధిష్ఠిరుడు: [అతన్ని నిదానించి చూచి మాటమాట తూస్తూ] అయ్యా, ఇక మీకు భయం అనేది లేదనుకోండి. మీమీద ఈగ వాలదు.

నకులుడు : అర్జునుడి అవార్తిలో వుంటే మీకు హాని ఎవ రయినా తలపెట్టడమే నా !

కుంతి : [సంతోషంలో] చెప్పలేదు నాయనా, మావాళ్ళసంగతి ? ఫలహారం కానీ.

భీ : నీకు అపకారం తలపెట్టేవాళ్లు ఎవ రయ్యా ? [గయుడి వీపుమీద చరుస్తాడు. గయుడు బోర్లకిల పడ్డాడు. పళ్లు చెదరిపోతవి]

కుంతి : అ దేమిట్రా నాయనా !

యుధి : భీముడూ, నీవు ఇవతలికి రా !

అ : అన్నయ్యా, నీసరసంతోటే స్వర్గానికి వెళ్లేటట్టే ఉన్నాడే గయుడు !

[ద్రౌపది చిరునవ్వు నవ్వుతుంది. గయుడు లేచి జంకుతో భీముడివైపు చూచి, దూరంగా వెళుతాడు. నకులసహదేవులు పండ్లన్నీ ఏరి పళ్లెంలో పెట్టి గయుడిముందర ఉంచుతారు. ద్రౌపది నీళ్లు అతనిముందర పెడుతుంది.]

కుంతి : నీ మోటుసరసము కొంచెంసేపు చాలించు నాయనా.

భీ : పర్వాలేదులే అమ్మా !

ద్రౌ : అవును పిల్లికి చెలగాటం ఎలక్కి...

అ : ఇక చెప్పండి స్వామీ, తమసంగతి.

ద్రౌ, కుం : ముందు ఆయనను ఫలహారం చేయనివ్వండి.

గ : తింటాను లెండి ... నన్ను గయుడంటారు. గంధర్వరాజును. పొద్దున్నే లేచి ఎవరి మొఖం చూశానో ! ... స్నానం కాగానే అలవాటుప్రకారం, తాంబూలము వేసుకుంటూ దేవాలయమువయిపు బయలుదేరాను.

నకులుడు : తాంబూలము వేసుకొనా దేవళానికి వెళ్లేది ?

గ : మాఆచారం లెండి.

భీ : తరవాత ?

అ : [అమ్మాలు వగైరా కట్టగట్టి] ఇవ్వన్నీ యింట్లో పదిలం చెయ్యి. [ద్రౌపది చేతికిస్తాడు.]

ద్రౌ : సరే లెండి. కథ కానివ్వండి.

గ : పోతూ పోతూ తమ్మ వుమ్మివేశాను.

యు: కొంపదీసి ఎవరిమీదా పడలేదుగదా!

గ : సరిగ్గా అంతే అయింది, దురదృష్టవశాత్తు. సూర్యుడికి అర్ఘ్యం యిస్తున్న ఒక మహారాజు చేతులో సూటిగా పడ్డది. కిందికి తిరిగి చూచేటప్పటికి నన్ను చంపేస్తానని శపథం చేశాడు.

కుంతి : పొరపాటున తమ్మపడగానే అంత కోపము రావాలా ? [అందరితో] ఎంత భయపడ్డా డనుకున్నారు, పాపం ! పులివాత బడబోతున్న లేడిపిల్లలాగా, గడగడా వణుకుతూ వచ్చిపడ్డాడు.

ద్రౌ : పాపం పొరపాటున తప్పు...

భీముడు : [కచ్చితంగా] ఏతప్పూలేదు గయుడూ.

యు : ఇంతమాత్రానికే చంపాలని శాద్ది తీయాలనా ?

నకు : ఎవరది? వట్టి వెర్రివాడులా గున్నాడే

సహ : వెర్రివాడా ! వట్టి పొగరుబోతు ! రాజ్యాధికారం సైన్యబలం వుండి మదించి ... సాకు దొరికింది గదా అని కత్తికట్టడమూ !

కుంతి : ఏ మయింది తర్వాత ?

గ : నాకేసి చూశాడాయన, చూసి నరికేస్తానని శపథం చేశాడు. నేను ప్రాణాలు బిగబట్టి తప్పించుకొని... యిప్పటికి మీఅండ చేరా.

ద్రౌ : పాపము, ఎంత శ్రమపడ్డారు !

నకు : నీవు గంధర్వరాజువు గదా. ఎవరో రాజు నిన్ను చంపుతానని శాద్ది చేసినంత మాత్రాన ఇంతభయము ఎందుకు? నీదుర్గంలో ప్రవేశించి గంధర్వసైన్యాలను ఆయత్తపరచి ఆరాజు వస్తే నీవే చంపివేయవచ్చునే.

గ : మామూలురా జయితే ఇలాగే చేసేవాణ్ణి.

ద్రౌ : ఎవ రారాజు ?

భీ : ఇం కెవ రయిఉంటాడు ? దుర్యోధనుడే. రానీ అదృష్టుణ్ణి, మదం అణగ గొట్టాను !

గ : అతను కానే కాదు.

భీ : దుశ్శాసనుడా ? మరీ మంచిది. రానీ వాడిని గుండెలు చీల్చి నెత్తురు తాగుతా !

యు : వాండ్లను ఎందుకు తూలనాడటం ?

భీ : ఊరికే ఏమిటి ? నిజానికి వాండ్లను ఎందుకు అనాలి! వాండ్లను ఏమన్నా అంటే మీరు పయిన వేసుకుంటారు.

ద్రౌ : ఎప్పుడూ ఇంతే యీయన !

అ : నిజం. ఈనేగనక ప్రతిదానికి అసరా కాకపోతే ఈపాటికే వాండ్లను హతమార్చేసి ఉందుము ! తనలాగా వాండ్లకు తనుకూడా ఒకడు పోగైనాడు !

కుంతి : దుశ్శాసనుడేనా ?

గ : కాదమ్మా, దుశ్శాసనుడు కాదమ్మా.

ద్రౌ : మరి ఎవ రయితే ?

యు : సందేహించ నక్కరలేదు. చెప్పండి.

గ : [సందేహిస్తూ] చెప్పమంటారా ?

భీ : వెంటనే.

గ : చెప్పినతరవాత నన్ను వదలిపెట్టరుగదా ?

కుంతి : ఎందుకు వదలిపెట్టారు ?

నకు : వా డెవ డైతే నేమి ? భయమా ?

సహ : మంచిమాట [నవ్వుతాడు]

భీ : ఎవ డయ్యా వాడు ? చూడక ఏదో పొరపాటున ఉమ్మేస్తే చంపుతాడా ? ఎందు కంతకొవ్వు! రానీ వాడి నిక్కడికి...చెప్తాను.

అ : చెప్పండి బాబూ. మిమ్మల్ని ఎవ్వరూ విడిచిపెట్టరు.

గ : [అందరిముఖాలు తేరిపార చూచి నెమ్మదిగా] కృ-ష్ణు-డు.

యు : [నిర్ఘాంతపోయి] కృష్ణుడా !

నకు, సహ : కృష్ణుడా !

కుంతి, ద్రౌ : కృష్ణుడా !

భీ : [నిశ్చింతగా] కృష్ణుడా ?

గ : ఊ, కృష్ణుడే.

[నిశ్శబ్దము. అందరూ ఒకరిముఖము ఒకరు చూచుకొంటారు. గయుడికేసిచూడరు. భీముడు మాత్రము గయుడిపాత్రలో పండొకటి తీసి ఒలిచి తినడం మొదలుపెడతాడు. గయుడు ఒకరితరువాత ఒకరిముఖం చూస్తాడు.]

భీ : [మీసం మెలివేస్తూ] కృష్ణు డైతే మాత్రము పొరపాటున ఉమ్మివేసినవాడిని చంపుతాడా ! గయుడూ, గయుడూ, కృష్ణుడయినా సరే గిష్ణుడయినా సరే...నీకేం ఫర్వా లేదులే.

యు : [హీనస్వరంతో] భీముడూ, వూరికే తెలిసీ తెలియక...నువ్వు కాస్సేపు వూరుకో.

గ : [నిశ్శబ్దంగా వున్న అందరికేసి ఆదుర్దాగా చూసి] అయితే... నన్ను... వదలేయరు గదా ?

భీ : బాస చేసినతరువాత— నిన్ను రక్షించవలసిందే.

యు : [కొంచెము విసుగుతో] భీమన్నా, కాస్త వూరుకుందూ.

ద్రౌ : కృష్ణుడిమీద ఎందుకు ఉమ్మేశావయ్యా ?

కుంతి : [కొంచెం విచారంగా] చూడక వుమ్మేశా నంటుంటే—

అ : అయిపోయిందానికి రభస ఎందుకమ్మా.

యు : అయినా, పనులు మాటలంత తేటలా ?

భీ : అంటే?

యు : మరేమీ లేదు.కృష్ణుడితో వైరం... సామాన్య...

భీ : ఉస్. ఇదా ! మ రేదో అనుకుంటిని !

నకు : బావమరదితో కృష్ణుడు దెబ్బలాడ్తాడా ?

సహ : సమయం వస్తే చుట్టరికాలు ఏం అడ్డం వస్తయి?

నకు : ఇప్పు డేంమహా పెద్దసమయం వచ్చింది? ఏదో గయుడు చూడక ఉమ్మేశాడు. కృష్ణుడికి కోపమే వచ్చింది. అర్జునుడు బావా వూరుకో అంటే కృష్ణుడు సర్దుకోడూ? అంతగా కావలిస్తే గయుడు క్షమాపణ కోరుతాడు.

యుధి : ఎందు కరా మీ కీభ్రమ!

ద్రౌ : భ్రమేమిటి?

యుధి : అతను పట్టినపట్టు విడిచేమనిషి కాడు.

భీ : ఎందుకు విడవడేం?

యుధి : ఇంతసేపట్లోగా గయుణ్ని ఖండిస్తా నని శపథం చేశాడు గాదూ?

భీ : గయుణ్ని రక్షిస్తా నని అర్జునుడు శపథం చేశాడు కాదూ?

సహ : ముందు శపథం చేసింది కృష్ణుడు గాదూ!

భీ : ముందు చేసినంతమాత్రాన...మనకు అర్జునుడి శపథమా కృష్ణుడి శపథమాముఖ్యము?

యుధి : ఒకరిశపథం ఇంకొకరిశపథంకంటె ఎక్కువా కాదు, తక్కువా కాదు. కాని ... వర్తమానకాలంలో ... కృష్ణుడే గనుక తన శక్తిమీదనే గట్టిగా నిలబడితే మనకర్తవ్యం ఏమిటి ... మనము ఎలా సంచరించాలి, ఏ మార్గం తొక్కాలి అని ...

భీ : ఈమాత్రానికే పెద్ద ఆలోచన ఎందుకు? మనశపథం నిలుపుకోడమే కర్తవ్యం. మనమార్గం రాజమార్గమే.

నకు : ఏమిటి భీమన్నా, నీవు చెప్పేది?

భీ : ఏమీ లేదు తమ్ముడూ. గయుణ్ని చంపాలిసిందే నని కృష్ణుడు మొండిపట్టు పట్టుకుకూర్చున్నాడో,—

ద్రౌ : ఏమిటి పెద్దపెద్దకబుర్లు! కౌరవులు నిండుసభలో నన్ను అవమానము చేసినప్పుడు, ఏమీ లేదు గాని —

కుంతి : అయిపోయిందానికి ఇప్పు డెందుకు చర్చ? [గయుడితో] నీవు వెళ్లి కుటీరము లోపల కూర్చో నాయనా. ఇవతల ఉంటే చప్పున కృష్ణుడో అతని పరివారమో, ఏం చేసినా, ముప్పు వస్తుంది.

గ : నేను —

అ : నీ కేమి ముప్పురాదు.

భీ : నీ కేమి పర్వా లేదు లేవయ్యా, లోపలికి పోయి కూర్చో.

గ : [లేస్తూ] నావల్ల మీ కెటువంటిచిక్కు వచ్చింది?

భీ : మాకు చిక్కు లేమిటి! నీటిలో తిరిగే చేప మునిగి చస్తుందా? మాకు ఏపరిస్థితులు విషమం కానేకావు.

అ : మాకు కష్టా లేమిటి? కుటీరంలోకి వెళ్ళి కూర్చోండి.

గ : మహాత్ములు మీ రేమన్నా కష్టాలు కష్టాలు గాకపోతాయా? నేను ప్రస్తుతము కారణం అయినాను.

కుంతి : అది విధి నాయనా. నీ చేతులో వుంది గనుకనా? ఈనాటికి నీవు నిమిత్తమయినావు. నీవల్ల గాకపోతే ఇంకొకరివల్ల నయినా కృష్ణుడితో వైరము వచ్చేదే.

యు : గంధర్వరాజా! మీరు లోపలికి దయచేయండి.

[గయుడు నిదానంగా అడుగులు వేస్తూ అనుమానంగా అందరిముఖాలు చూస్తూ లోపలికి వెళ్లుతాడు.]

కుంతి : కర్తవ్యం ఏమిటో ఆలోచించండి.

భీ : కర్తవ్యం ఏమిటి? అర్జునుడు మాట యిచ్చాడు. కష్టమో నిష్ఠురమో, గయుడిని రక్షించవలసిందే.

కుంతి : అంతేనా? ఆలోచనా సాలోచనా ఏమి అక్కరలేదూ?

యు : ఏమిగతి !

కుంతి : అర్జునుడు సుభద్రతో చెపితే సుభద్ర కృష్ణుడితో మాట్లాడి అంతా సర్ది వేయలేదూ?

యు : ఆ, బాగున్నది. అర్జునా, ఒక్కసారి సుభద్రతో—

అ : బావను చూస్తే భయమా నాకు? ఓ చెంప కృష్ణుడు తరుముకు వస్తున్నాడట. [చిరునవ్వు. భీముడు పెద్దపెట్టున నవ్వు.]

కుంతి : నీకు భయ మని ఎవ రన్నారు రాత్రి అబ్బాయి?

నకు: అర్జన్నా, నీవు వెళ్తే మేమంతా లేమూ?

అ : కృష్ణుడు ఎవరిమాటా పెడచెవిని బెడితే?

కుంతి: అనవసరంగా జగడం ఎందుకు నాయనా?

భీ : జగడం మనము కోరి తెచ్చుకున్నామూ?

యు: అలా అని ఎవ రన్నారు? దానంతట అదే వచ్చింది. కాలానికి కట్టుబడి ఉన్న మనము ఏలాగో సర్దుకో నేపని చేయాలి.

భీ: ఎప్పుడూ పద్దానికి మనమే సర్దుకోడం. ఈఒక్కసారికి ఆయనను సర్దుకోనీ.

కుంతి : [విచారంతో] ఎటువంటి కాని రోజులు వచ్చినయి నాయినా, మనకు! మాలిగే వాడికె త్రిమీద తాటికాయపడ్డట్టు. మన అవస్థలకుతోడు కృష్ణుడితో జగడంకూడాను [నిట్టూర్పు విడుస్తుంది.]

యు : పెద్దలు చెప్పినట్టు కష్టాలు ఒంటిగా రావు.

భీ : [కొంచెము విసుగుతో] ఎప్పుడూ కష్టాలు కష్టాలు అని గునుస్తూ కూర్చోటమే. కష్టాలు కలకాల ముంటాయా? ఐనా యింత కంటె చెడిపోయే దేమున్నది? రాజ్యమూ పోయింది; ఇక ప్రాణాలు మిగిలినవి; క్షత్రియ ధర్మ మయినశిష్టరక్షణమూడా మానుకుంటే ప్రాణా లున్నా ఒకటే లేకపోయినా ఒకటే.

అ : గయుడిని రక్షించవలసిందే.

నకు : అవును.

సహ : అవును.

భీ : తప్పక.

యుధి : [వాళ్ళముఖా లొక్కసారి చూచి] కార్యంపట్ల...తొందరపడి...మాట్లాడటం

ద్రౌ : [భీముడితో] మీ కొందుకండీ, అనవసరపుచొరవ? ఎవరి కర్తవ్యము వారికి స్ఫురించదూ?

భీ : వా ళ్ళొకటి నే నొకటినా?

కుంతి : అందరూ ఒకటే కాదుటే తల్లీ! కర్తవ్యం నిశ్చయించండి నాయనా.

అ : ఇంకా ఆలోచన కే ముంది?

[గుర్రపుడెక్కల చప్పుడు వినబడుతుంది. వచ్చారు వచ్చారు అంటూ గయుడు కుటీరం లోనుంచి ఎగిరి దూకుతాడు. ద్రౌపది నవ్వు అపుకుంటుంది.]

గ : వచ్చారు, వచ్చారు, వచ్చారు!

భీ : ఎవ రొస్తే నీ కేం? కుటీరంలో కూర్చో మంటే కూర్చోవు.

గ : [దిగాలుపడి] కుటీరంలో వుంటే నేమి, పాతాళానికి వెళితే నేమి - వాళ్ళు పసిపట్టి నాగుపాములలాగా తరుముకు వస్తారు.

యుధి : భీమన్నా, నీవు గంధర్వరాజును స్త్రీలను, కుటీరంలో పదిలంగా వుంచు. నకుల సహదేవులనుకూడా, సంరక్షణాగము తీసుకొని వెళ్ళు. నేనూ అర్జునుడు కృష్ణుడితో మాట్లాడుతాము. అమ్మా, నీవుకూడా లోపలికి వెళ్లు

కుంతి : కాదులే. నేనుకూడా కృష్ణుడితో మాట్లాడుతా.

భీ : నేను లోపలికి వెళ్ళడం ఎందుకు? ఇక్కడే ఉండటం మంచిది. వీ ళ్ళిద్దరూ వెళ్తారులే.

నకులసహదేవులు : మేంగూడా యిక్కడే వుంటే మంచిదేమో?

యుధి : మీరు గయుడికి అంగరక్షకులుగా వుండాలి.

[ గుర్రపుడెక్కల చప్పుడు మరీదగ్గరగా వినబడుతుంది ]

గ : ఇం కేముందీ, వచ్చేశారు వాళ్లు!

అ : నకులసహదేవులూ, ఈయనను మీరు కుటీరంలోకి తీసుకువెళ్లి అంగరక్షకులుగా వుండండి.

యుధి : [ద్రౌపదితో] నీవుగూడా లోపలికి వెళ్లు [ అందరూ కుటీరంలోపలికి వెళ్లుతారు. ]

అ : అమ్మా, నీవు వెళ్లవూ ?

కుంతి : ఇక్కడే వుంటాను.

నకు: అన్నయ్యా గాండీవము తెచ్చియ్యనా? కట్టిచేతుల్తో వున్నావు.

భీ : అడగాలేమి ? గాండీవము, నాగద యిలా పట్టుకురా.

యు : అనవసరంగా ఆయుధా లెందుకు ? నిశ్శబ్దంగా ఉండండి.

ద్రౌ : [ లోపలినుంచి ] చేయి జారిన తరువాత అనుకున్న ప్రయోజన ముండదు. ఆయుధాలు తీసుకోండి.

గ : [లోపలినుంచి] ఆయుధము హస్తంలో వుంచుకోడం ఎప్పుడూ మంచిది. దాహమయినప్పుడు నుయ్యి తవ్వటం కంటె—

యు : ఉండవయ్యా, అంత కొంపమునిగే పరిస్థితులు ఏమీ లేవు. నే నిక్కడ లేనూ ? నీ కెందుకీ ఆందోళన ?

భీ: మాఅన్నగారిది ఎప్పుడూ ఒకటేధోరణి ... ఏమిటి డెక్కలచప్పుడు ఆగింది ?

యు : ఇటే వస్తున్నారు.

కుంతి : ఎవరు వస్తున్నారు నాయనా ?

భీ : [ నిర్లక్ష్యంగా ] ఎవరొస్తే ఏం ?

యు : [ విసుగుతో ] కాస్త వూరుకో భీమన్నా.

కుంతి : అరుగో, కృష్ణ బలరాములు, ఇదంతా నిజం అన్నమాటే !

యు : [కొంచెం విచారంతో] ఇంకా సందేహమా!

[అందరు అటువయిపు చూస్తారు.]

[తెరలో]

ఇటే వెళ్ళినట్లున్నాడు. ఔను. అదిగో కుటీరము. లోపలికి వెళ్ళివుంటాడు.

[ కృష్ణబలరాములు ప్రవేశిస్తారు. ఇద్దరూ పాండవులను కుంతిని చూచి ఆశ్చర్యపడతారు ]

బలరాముడు : ఇ దేమిటి, యిక్క డున్నారేం ?

కృ : వీళ్ల అరణ్యవాసం కాదూ ... మీ రెప్పుడు వచ్చారు అత్తా యిక్కడికి ?

కుంతి : అబ్బాయిలను చూచి పోదామని మొన్న నే వచ్చా. అంతా కుశలమేనా నాయనా?

బల : కాక మరేమిటి ?

కృ : అవును కుశలమే. మీ రంతా—

భీ : ఓ కుశలమే.

యుధి ; ఏమి యిలా దయచేశారు ? అనుకోని మీదర్శనమువల్ల అంతా ధన్యులము.

అ : ఏమిటి బావా, అనుకోకుండా యిలా వచ్చావు ?

భీ : ఊరక రారు మహాత్ములు అన్నారు కాదూ పెద్దలు ? పనిమీద నే వచ్చి ఉంటారు.

బల : ఇవాళ ప్రొద్దున—

కృ : అన్నయ్యా, మీ రుండండి. అంతా సవిస్తరంగా చెపుతాను.

యు : ఏదో జరిగిం దన్నమాట.

కృ : ఉదయం నేను జపం చేస్తూ అర్ఘ్యం విడిచేటప్పుడు చేతులో ఉమ్మివేశాడు. వాడ్ని ఖండిస్తానని నేను శపథం చేసేసరికి పారిపోయాడు. ఇప్పటిదాకా వాడికోసమే వెతుకుతున్నాము.

యు : ఏదో స్వల్పవిషయానికి ... వదిలేయగూడదూ. పనులన్నీ వదలుకొని... ఎందుకింత శ్రమపడ్డావు ?

కుంతి : నాయనా, ఉమ్మి మీద పడ్డదా !

బల : సరి, తాంబూలముకూడా వేసుకు న్నాడు తులువ.

యు : అలాగా. ఇక్కడ విశ్రాంతి తీసు కోరూ ?

బల : విశ్రాంతా ? వాడిని పట్టి ముక్కలు ముక్కలుగా చీల్చి కాకులకు గద్దలకు వేసిం దాకా విశ్రాంతి లేదు. అంతమదమా వాడికి !

కుంతి : దానికా నాయనా, ఇంతకోపం !

బల : బాగుంది ! గంగిగోవులాంటి మా తమ్ముడికే అఖండకోపం వస్తే—

భీ : [ చిరునవ్వుతో ] మా చిన్న బావ గంగి గోవా ! అంబో తంటూందే లోకం !

[యుధిష్ఠిరుడు భీమునివంక తీక్ష్ణంగా చూస్తాడు. భీముడు నిర్లక్ష్యంగా మీసాలు తిప్పుతూ పైకి చూస్తాడు. కృష్ణుడికళ్ళు మెరుస్తాయి ]

కుంతి: కోపం వచ్చినా కొంత శాంతించాలి. అంతక్రోధ మెందు కబ్బాయి !

బల : క్రోధమో కాదో. మా తమ్ముడు శపథం చేశాడు.

కుంతి : శపథమా ? అయితే అంతా నిజ మన్న మాటే.

యు : [గొణుగుతూ] ఇందుకనే ఆడవాళ్ళ నిక్కడ ఉండవద్దన్నది.

కృ : వా డిటు వచ్చాడా ?

కుంతి : [ నిస్సత్తువగా ] గడియకిందనే—

యు : [ అడ్డంవచ్చి ] అమ్మా. నీ వుండు; నేను చెప్పుతాను.

కృ : ఆమెనే చెప్పనిస్తూ.

కుంతి : [ పెద్దకొడుకుతో ] నీవే చెప్పు నాయనా.

యు : [కృష్ణుడిదగ్గిరకి వెళ్లి చిరునవ్వుతో ] బాగా అలిసిపోయినట్టున్నావు. కాస్సేపు కూచుని సేదతీర్చుకోరాదూ ? కాస్త ఫలహారం పుచ్చుకోండి ఇద్దరూ. తర్వాత మాట్లాడుకో వచ్చు.

కృ : పాతకాలానికి ఇక్కడకు రాలేదు. వేగిరం విషయ మేమిటో చెప్పండి. ఉదయం లోగా వాణ్ణి పట్టుకోవాలి.

యు : ఎందు కింత తొందర ? మర్యాదలు మాత్రం అయిపోయి ఉండక్కర్లా ? కాటికైనా కాస్త నీరు పట్టవద్దా ?

బలరాముడు : [ భీముడితో ] వదినగారూ దేవులూ ద్రౌపదీ ఏరీ ?

భీ : వాళ్ళు గయుణ్ణి తీసుకొని —

కృ : [ఆత్రంతో] ఆం గయుణ్ణి తీసుకొని ద్వారకకు బయలుదేరారా ? మేలు మేలు యుధిష్ఠిరా ! నీ కెంతో కృతజ్ఞుణ్ణి. ఖలుణ్ణి పట్టి పంపించావే మాయింటికి !

బల : అంతట్లోకే మాకు సంగతు లన్నీ తెలియడమూ, వాణ్ణి పట్టడం, పంపడం—బంధువు అంటే మీరే !

[అందరూ తెల్లపోతారు]

అ: [నిదానంగా] ఏమిటి అంటున్నారు?...

బల : బంధువు లన్నా మిత్రు లన్నా మీరే నయ్యా! [సంతోషము వెలిబుచ్చుతాడు]

కృ : ఏమిటి నీవు చెప్పబోయింది అర్జునా !

కుంతి : మ రేమీ లేదు నాయనా ! అర్జునుడు గయుణ్ణి రక్షిస్తా నని వాగ్దానం—

కృ, బల : ఏమిటి !

కృ : వాగ్దానం చేశాడా ! అర్జునుడా !

భీ : అవును. అర్జునుడే ... వాగ్దానం చేశాడు.

బల : ఎందుకు చెయ్యాలి ?

భీ : ఏం చేస్తే ?

బల : [తల గీరుకుంటూ] అయితే మా కృష్ణుడి శపథం—

భీ : నా కేం తెలుసు !

కృ : అన్నయ్యా, నీ పూటకో, అర్జు ... మాట ఇచ్చావా ?

అ : అవును.

కృ : ఏ మని ?

బల : అయితే గయుణ్ణి ఎక్కడ దాచారు?

భీ : నీ కెందుకు ?

బల : పట్టి యీడ్చుకు వచ్చేటందుకు.

భీ : వీలు లేదు.

బల : అరరే! ఎంతటక్కరులు మీరంతా ! మీఅన్న చూడు— గుంటనక్కలాగ— ఏమీ మాట్లాడడు.

భీ: మాఅన్నయ్యనుగురించి ఏమంటున్నావు! భద్రం.

కృ : అన్నా, నీ వూరుకో.

అ : కృష్ణా ! నేను గయుణ్ణి రక్షిస్తానని అభయ మిచ్చాను. నీవు అతన్ని విడిచిపెట్టాలి.

కృ : [ కోపం అణచుకొంటూ ] అలాగా ! అయితే నాకు అడ్డం వస్తావా ?

అ : అటువంటి అభిలాష ఎంతమాత్రం లేదు.

కృ : అయితే—

అ : గయుణ్ణి రక్షించక తప్పదు.

కృ : తప్పదూ ?

అ : [ నీరసంగా ] తప్పదు.

కృ : అయితే నావిరోధిని చేరదీస్తావా ?

అ : నీవిరోధని నా కెలా తెలుసు ?

కృ : ఇప్పుడు తెలియడం లేదూ ?

అ : ఇప్పుడు తెలిస్తే ఏమి లాభం !

కృ : నీతాత్పర్యం ?

అ : అభయం యిచ్చాను. నీవిరోధో, అ శ్రీకృష్ణుని విరోధో ! పార్థునిమాట పార్థుని మాటే.

[కృష్ణుడు కుంతివైపు,ధర్మరాజువంక,భీముడి కేసి చూస్తాడు. భీముడు నిర్లక్ష్యంగా చిరునవ్వుతో చూస్తాడు. అర్జునుడిముఖంలో దృఢ సంకల్పం కనబడుతుంది]

కృ : [చిరునవ్వుతో] అర్జునా !

అ : ఆ.

కృ : నీబావను, మిత్రుణ్ణి.

అ : అవును.

కృ : నామాట వినవూ ? నామాట ఒకటీ, నీమాట ఒకటా ! నామాట తప్పిపోతే నీకు మాత్రం కీర్తికరమా ? మాట తప్పే కృష్ణుడి బావమరది అర్జునుడంటే — లోకం ఏ మను కొంటుంది ?

అ : నా మాటసంగతి ఏమయినా ఆలోచించావా ?

కృ : నీవు మాట యిచ్చినట్టు ఎవరికి తెలుసు ? నాశపథంసంగతి లోకానికి వెల్లడి అయిపోయింది. గయుణ్ణి నాకు అప్పజెప్పితే నిన్ను ఎవరూ ఏమీ అనరు. వాడు రేపు జీవించి ఉంటే నన్ను లోకం ఏమంటుంది ? నామాట విను అర్జునా !

అ : సరిగా నీమాటలే నయ్యా, యివి బావా !

కృ : [ ముఖం ఎర్రబడినా లేనినవ్వు తెచ్చుకొని ] అంటే ?

అ: మాట యిచ్చినతర్వాత నలుగురికి తెలిస్తే ఒకటీ, లోకానికి తెలిస్తే ఒకటీ అవుతుందా ?

కృ : అయితే పట్టుదల విడవవు ?

అ : వీలు లేదు.

కృ : నీవు చేసేపని నీకు అర్థమవుతున్నదా ?

అ : బెదిరిస్తావా బావా !

బల : [కోపంతో] కృష్ణా, ఇక మాటలతో పని అయ్యేటట్టు లేదు. నిమిషాలు ఎగిరిపోతున్నవి. గయుణ్ణి పట్టుకోవాలి. ఎవరు అడ్డం వస్తే వారిని—

భీ : మాటలంత సులభమా పనులు ?

బల : నీవు అడ్డం వస్తావా ? వచ్చినప్పుడు చూస్తాములే... అర్జునా, గయుణ్ణి ఎక్కడ దాచావు ? వెంటనే చెపుతావా...చెప్పవా !

అ : [చిరునవ్వుతో] చెప్పకపోతే ?

బల : [తొంగిచూచినద్రౌపదిని గమనించి] అదుగో ద్రౌపది. నకులసహదేవులు గంధర్వుణ్ణి

దాచి అక్కడే వుంటారు. కృష్ణా, కుటీరం లోకి వెళుదాము, పద.

భీ: [గుమ్మానికి అడ్డం నిలుచుని] ఎక్కడికి? అ గక్కడ.

కృ : [విశ్వాసంతో] సరే, గయుడు దొరికాడన్నమాటే.

అ : [అడ్డం నిలుచుని] ఇంకా దొరకలేదు.

కృ : [కోపంతో] ఎందుచేత ?

అ : నన్ను తప్పించుకుని నీవు వెళ్ళినతర్వాత గదా దొరికేది ?

[ద్రౌపది ఇవతలికి వస్తుంది. నకులసహదేవులు కత్తులతో గుమ్మానికి రెండుపక్కలా నిలుచుంటారు ]

భీ : మీ రెందుకు వచ్చారు ?

కృ : చూచావా ద్రౌపదీ, వీళ్ళు ? లేశమైనా కృతజ్ఞత లేకుండా నాకే అడ్డుపడుతున్నారు !

ద్రౌ : కృతజ్ఞత లేక కాదు. మిమ్మలిని మరవగలమా !

కృ : అయితే నీవు చెప్పగూడదా వీళ్లతో!

[అందరూ ద్రౌపదివంక చూస్తారు]

ద్రౌ : ఏ మని చెప్పను? ఆయన అభయం ఇచ్చారు. గంధర్వరాజును మేకలాగ అప్పగించ మని చెప్పడం భావ్యమా ?

బల : ఎంతవాళ్ళురా వీళ్ళు ! మాటా పలుకు అందరిదీ ఒకటే నే. ఇదుగో, కృష్ణుడికి కోపం వస్తే నాశనమైపోతారు !

ద్రౌ : నాశనమా ! మీపుత్రులని నాశనం చెయ్యడం ఎవరితరం అత్తా !

కుంతి : ఆయుస్సుంటే ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. ఆబ్రహ్మదేముడే ఏమీ చెయ్యలేడు.

బల : అయితే మీపట్టుదల విడవ రన్న మాట.

భీ : అలాగే.

బల : కృష్ణా ! ఇంకా సంశయిస్తా వేమి ? [కత్తి దూసి భీముడిమీదికి విసరబోతాడు.]

కుంతి : [అడ్డం వెళ్ళి] నాకొడుకును ఏమని కొడతావు !

యుధి : [తటాలున వచ్చి బలరాముడిచెయ్యి పట్టుకొని] మాఅమ్మను కొడతావా ! చేస్తే నా తమ్ముళ్ళతో, నాతో యుద్ధం చెయ్యాలి. మేము పోట్లాడుతాం, చస్తాం, చావడానికి సిద్ధంగా ఉన్నాం. అంతేగాని మాఅమ్మను కొడతారా ? మాఅమ్మను, మాఅమ్మను !

నకు, సహ : [కత్తులు ఝళిపిస్తూ] మా అమ్మను కొడతారా !

భీ : మాఅమ్మను కొడతావా మహావీరుడివి!

బల : [హతాశుడై] అరరే, ఎంతపని జరిగింది. [కత్తి జార విడుస్తాడు].

ద్రౌ : మాఅత్తను కొట్టడానికి మీకు చేతులెలా వచ్చాయి! గొప్ప వీరుడివి !

[బలరాముడు తికమక పడతాడు]

కృ : [చప్పున వంగి కుంతికాళ్లు పట్టుకుంటాడు] అత్తా, క్షమించాలి. మీకు ఆగ్రహం వస్తే భరించగలనా ! ఎంతకోపం, ఎంతకోపం! మీ ముఖాన శివుడు తాండవిస్తున్నాడే ! క్షమించు. మాఅన్న పొరపాటుకుకూడా నేనే క్షమాపణ కోరుతున్నాను. క్షమించాలి !

కుంతి : క్షమించాలి ! మంచిమాట !

ద్రౌ : క్షమించాలెనా !

యుధి : [చల్లగా] నీవుమాత్రం ఇతరులను క్షమించవు. నిన్నుమట్టుకు అందరూ క్షమించాలి !

గ : [అమాంతం ఎగిరి దూకి కృష్ణుడిరెండుకాళ్ళూ పట్టుకొని] క్షమించాలి మహాప్రభూ! క్షమించిందాకా ఈకాళ్లు విడవను !

కృ: [విసుగుతో] నీవు అలా ఉండవయ్యా! అత్తా, మీరు క్షమించేదాకా ఈకాళ్లు విడవను!

కుంతి : నీవు గంధర్వరాజును క్షమిస్తానంటే —

కృ : మీరు కోరిందల్లా చెయ్యడానికి సిద్ధంగా ఉంటే,..నాకే తొందర...

గ : అంతకూ కారణం నాబుద్ధిలోపమే ! పొద్దున్నే తాంబూలం వేసుకోవలెనని పాడు బుద్ధి ఎందుకు పుట్టాలి ! పుట్టిందేపో చూడకుండా ఉమ్మి వెయ్యడం ఎందుకు ? కృష్ణా, క్షమించాలి, రక్షించాలి !

యుధి : ఎందుకు రక్షించడు — దాసుడి తప్పు దండంతో సరి కాదూ ?

కృ : క్షమించాం, లేవయ్యా, చంపములే!

[గయుడు లేస్తాడు. అందరిముఖాన సంతోషము. కుంతి ధర్మరాజును చిరునవ్వుతో చూస్తుంది]

కృ : అత్తా, క్షమించలేదు ఇంకా.

కుంతి : [శాంతంగా] నీ అంతవాణ్ణి క్షమించడానికి నే నెంతదాన్ని నాయనా! నీవు నాకొడుకువంటివాడవు గావూ ? లే.

భీ : [సంతోషము పట్టలేక] బావా, లే. ఏమిటి అసహ్యంగా కాళ్ళు పట్టుకోడం !

అ : [వెళ్ళి కృష్ణుని లేవనెత్తి] బావా !

కృ : బావా ! [కౌగిలించుకుంటారు]

భీ : ఇదంతా అనవసరమయిన వెర్రి !

బల : మెల్లిగా అంటావేం !

యు : అందుకే... తొందరపడి...ప్రతిజ్ఞలు

[తెరలో గానము. నెమ్మదిగా నారదుడు ప్రవేశము. అందరూ నమస్కారము చేస్తారు]

కృ : ఏమి స్వామీ, యిలా దయచేశారు ?

నారదుడు : గయుడేమయినాడో కనుక్కుందామని.

గ : దివ్యమునీంద్రా, తమ అనుగ్రహంవల్ల సురక్షితం. అర్జునుడు ఎంత ఆశ్రితపక్షపాతి! కృష్ణభగవానుడు ఎంతదయార్ద్రహృదయుడు ! నా అవస్థకు కారణము తాంబూలము. ఈజన్మకు ఇక తాంబూలం—

యు : మీ రంతా యింతే. ప్రతిదానికీ తొందర...

కుంతి : అయిందేదో అయింది. అన్నీ మరచిపో నాయనా.

కృ : పొరపాట్లు క్షమించాలిసిందేలే.

భీ : గంధర్వరాజా, నీవు తాంబూలము అనే శపథం పూర్తిచేసినట్లు లేదే. తెలివయినవాడవు ! [అని వీపుమీద చరుస్తాడు. గయుడు బోల్లపడబోయి రెండంగలు వేసి సర్దుకుంటాడు. బలరాముడు సహాయపడతాడు.]

ద్రౌ: దైవకృపవల్ల అంతా శుభంగానే పరిణమించింది.

నారదుడు [వీణె శ్రుతి చేసి]

జయ జయ గోకులబాల
జయ సకలాగమమూల !
దయయా మాం గోపాల
దీనం పాలయ బాల !

దేవ మయా చరిత మిదం
దీనధియా అపరాధం
శ్రీవసుధాధిప, కృపయా
కేవల మిహా ధూమహి
జయ జయ ...

*

# కథానిక

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి



అంటే అభినవసాహిత్య సంసారానికి ఆత్మబంధు వైన 'చిన్నకథ'కు పురాణభారత సాహిత్యవేత్తలు పెట్టిన ముద్దుపేరు.

హిందీ, బెంగాలీ, తెనుగు మొదలయిన ఉత్తరదక్షిణ భారతీయసాహిత్య ప్రపంచంలో కొత్తగా ఒకఉన్నతపదాన్ని ఒడుచుకొని ప్రత్యేకశాఖగా ప్రవృద్ధమై నాడునాటికి అందాలు దిద్దుకొనే 'చిన్నకథ' పరసారస్వత పరిచయపరిపాటివల్లనే మనకు వచ్చిం దని ఒక అపోహ అనుశ్రుతముగా ఉన్నది.

English Short Story కి అనువాదరూప మయిన హ్రస్వకథ, 'చిన్నకథ', 'కథానకము' అనేపేర్లతో తల కొకరీతిగా మనలో కొంతమంది వాడుతున్నారు. దీన్నిబట్టి మనపూర్వసాహిత్యంలో ఇటువంటిరచన ఉన్నట్టు మనవారికి తెలియ దని తోస్తుంది.

అన్నివాఙ్మయాల్లోవలెనే ఆంధ్రవాఙ్మయంలోకూడా చెత్తపత్రికలలోని ఊక దంపుడుకథలు తప్పిస్తే చాలామంచి 'చిన్నకథ' రచన సాగుతోన్న దని చెప్పవచ్చు. తెనుగు చిన్నకథ రచనకు–ఒకటిరెండు శరత్తులు హెచ్చు తగ్గుల కేమి–'ఒక వెండి పండుగ కాలం' సమీపించింది. కాని ఇంతవరకూ దీనిపుట్టుపూర్వోత్తరాలుగురించి సూటిగా తెలుసుకొని నిర్వచించినవారు నామెరుకకు ఎవ్వరూ కనిపించరు.

అక్కిరాజు ఆంజనేయశర్మ గారు తమసారస్వత వ్యాససంపుటిలో Short Story కి సరి యైనపేరు లే దనిన్నీ, ఇంచుమించుగా హ్రస్వకథ, 'చిన్నకథ' అనవచ్చు ననీ, దీనికి మూలాలు బ్రాహ్మణోపనిష దాదివైదికవాఙ్మయమూ, పంచ తంత్రము, హితోపదేశము, భేతాళపంచవింశతి మొదలగు నవీ కావచ్చు ననీ వ్రాసి, పంచతంత్రమును ఎందరో ఖండాంతరీయులు అనువదించా రనీ క్రమంగా ప్రచారంకోసం ఆయావాఙ్మయాల్లో బయలుదేరిన చిన్నవ్యాసములు ఈ'చిన్నకథ'కు దారి చూపి ఉండవచ్చు ననీ నిరూపించారు. కాని బ్రాహ్మణాదికథలూ, పంచ తంత్రకథలూ కొన్ని అననుభూతవిషయాలను నిరూపించడానికి బయలుదేరాయి. వాటినుంచి క్రమంగా కథావాఙ్మయము తలచూపి ఉండవచ్చు. విశిష్టమై నానాత్వ, చమత్కారిత్వ, భావశిల్పాలకు ఆలవాల మైన 'చిన్నకథ' రచన పుట్టడానికి ఎంతో వ్యవధానమూ, ప్రోద్బలమూ ఉండాలి. ఒక్కపంచతంత్రాన్ని ఖండాంత

కాలు అనువదించుకొన్నంతమాత్రాన దానిలోంచి ఇంతఅద్భుతరచన పుట్టిఉండదు. పాశ్చాత్యుల Short Story వారి Novel నుంచి పుట్టియుండవచ్చు. ఇక మన 'చిన్నకథ' బ్రాహ్మణాదులనుంచి పరంపరగా అభివృద్ధికి వచ్చిన కథాకావ్యముల నుండి ఎన్నో కొత్త అందాలను తీర్చుకొని ప్రత్యేకరచనగా ఏర్పడింది గాని సరా సరిగా వాటినుంచి రాలేదు. మనపూర్వులే కథాప్రవృత్తిని ప్రస్తరించి 'చిన్న కథ'ను లక్షణాలతో నిర్వచించారు. దీనికి మనసాహిత్యశాస్త్రంలో 'కథానిక' అనేపేరు సిద్ధమై యుంది.

శివశంకర శాస్త్రి గారు "ఏకాదశి" పీఠికలో మనకు కథ, కథానకము, ఆఖ్యా నకము, ఆఖ్యాయిక అనేగద్యవిభాగా లున్నట్టు వ్రాశారు. అయితే వాటిని శాస్త్రి గారు వివరించనందువల్ల 'చిన్నకథ' అనేగద్యరచనావిభాగం దేనికి సరిపోతుందో తెలియక అబోధోపహతం అయింది.

నేను కొన్నాళ్ళనుంచీ చిన్నకథచరిత్ర కనుక్కోడానికి చేసేపరిశోధనలలో అమూల్యవిషయాలు కొన్ని దొరకడంచేత వాటిని ఆంధ్రప్రముఖులయెదుటికి తీసుకురావడానికి ఈవ్యాసం వ్రాస్తున్నాను.

భారతీయ సాహిత్యానికి విజ్ఞానసర్వస్వా లయిన పురాణాలు అద్భుతవిషయ భాండారాలు. వాటిలో ఒకటైన అగ్నిపురాణం సమూలకామంగా సాహిత్యమీ మాంస చేసింది. 337 అధ్యాయపు కావ్యాదిలక్షణనిరూపణ సందర్భంలో గద్య కావ్యవిభాగంగురించి ఇట్లా ఉంది:

> ఆఖ్యాయికా కథా ఖండకథా పరికథా కథా
> కథానికేతి మన్యంతే గద్యకావ్యం చ పంచధా.

1 ఆఖ్యాయిక. 2 కథ. 3 ఖండకథ. 4 పరికథ. 5 కథానిక, అని గద్య కావ్యాలు అయిదురకాలు.

ఇందులో కథానికే మన 'చిన్నకథ'.

ఈగద్యకావ్యవిభాగాలు ప్రాచీనసంస్కృతప్రాకృత గద్యకావ్యాలకు సరిపో తాయి. బృహత్కథను 'ఆఖ్యాయిక'గా చెప్పవచ్చు. కథాసరిత్సాగరము 'కథ' అనేవిభాగానికి చేరుతుంది. వాసవదత్త ఖండకథ. కాదంబరి పరికథ.

ఇక మిగిలిన 'కథానిక'కు లక్ష్యభూతా లయినప్రత్యేక సంస్కృతవచనరచన లేవీ కనిపించవు. కాని విక్రమార్కచరిత్ర, హితోపదేశము మొదలయిన కథల పుస్తకాలలోని ఒక్కొక్కకథ ఇంచుమించు కథానికాప్రాయముగా ఉంటుంది.

అప్రకృతం కనుక పూర్వోక్త గద్యకావ్యాల లక్షణనిర్వచనాలను విడిచిపెట్టి ప్రకృత 'కథానికా' లక్షణాన్ని ఉద్ధరించి లక్ష్యాలను పరామర్శిస్తాను.

భయానకం సుఖపరం గర్భే చ కరుణో రసః
అద్భుతోంతే సుక్లృప్తార్థా నోదాత్తా సా కథానికా.

కథానికబాహ్యలక్షణాలు రెండు 1. కథ సుదూరంగా సాగిపోక పొందికగా ఉండాలి. 2. పెద్దసమాసాలు, వర్ణనలతోను, కథాశరీరం బిగిసిపోకూడదు.

ఆభ్యంతరలక్షణాలు మూడు. 1. పఠితను భయసంభ్రమాశ్చర్యాల్లో ముంచే విచిత్రసంఘట్టన లుండాలి. 2. కథాగర్భంలో హృదయం కరిగించే కరుణసన్నివేశం కూర్చాలి. 3 పాఠకుడు అనుకోని కొత్తమలుపులతో కథ తమాషాగా ముగిసి పోవాలి. ఇది 'కథానికా' స్వభావం.

మహాకావ్యానికి చెప్పబడిన అష్టాదశవర్ణనల్లో కొన్ని ఉన్నా ప్రబంధత్వమునకు క్షతి లేనట్టు దీనిలో బాహ్యలక్షణాలు తప్పకుండా ఉంటూ, ఆభ్యంతరలక్షణాల్లో ఏఒకటైనా లోపించవచ్చు. అయితే అద్భుత నిర్వహణం మాత్రం విడిచిపెట్టితే 'కథానిక' రక్తికట్టడం చాలాకష్టం.

ఏవంవిధలక్షణాలతో సర్వాత్మనా, తులతూగే గద్యకావ్యాలు కనిపించక పోయినా, విక్రమార్కచరిత్రాదుల్లో ఈకథానికనీడలు మాత్రం బాగా గోచరి స్తాయి. మచ్చుకు విక్రమార్కచరిత్రలోని 12 వ కథ తీసుకోవచ్చు. ఈ కథలో మొదట సంభ్రమాశ్చర్యాల్లో ముంచే భయానకఘట్టం ఒకటి కనిపించి అది క్రమంగా వికసించి అద్భుత మయిననిర్వహణకు తిరుగుతుంది. దీన్ని విస్తరించి బాగా దిద్దితే మంచికథానిక అవుతుంది.

హితోపదేశంలోని ఘంటాకర్ణ, కందర్పకేతుకథలు, చాలా కథానికాలక్షణా లతో ఉన్నవి. దశకుమారచరిత్రలో కొందరిచరిత్రలు ప్రత్యేకించి తీర్చితే మంచి కథానిక లవుతాయి.

అగ్నిపురాణమునకు పూర్వం దండ్యాచార్యులు ఆఖ్యాయిక, ఆఖ్యానము, కథ అనేవిభాగాలే చెప్పినట్టు సాహిత్యదర్పణంలో విశ్వనాథకవిరాజు చెప్పి, తాను కూడా వాటినే నిర్వచించి చాలసూక్ష్మంగా ఆభాగము వదలివేశాడు. కాని అగ్నిపురాణంలో మాత్రము ఈగద్యకావ్యవైవిధ్యం కనిపిస్తుంది.

తరువాతి సాహిత్యశాస్త్రకారులు తమనాటికి గద్యరచనాబలం తగ్గి ప్రబంధ తత్పరత, దృశ్యకావ్యగోష్ఠి, హెచ్చడంచేత వచనరచనపైన దృష్టిలేక వాటిని నిర్వచించడం మాని ఉంటారు.

పెద్దగ్రంథాలు కనుక, కాదంబర్యాదులు బతికి ఉన్నవి. అయినా వాటిని అసత్కావ్యాల్లో చేర్చి ఎందుచేతనో పీడిస్తూనే వచ్చారు

'కథానిక' వంటి చిన్నరచనలు కాలగర్భంలో మణిగిపోయి ఉంటా యని నా ఊహ. ఏమంటే సాహిత్యదర్పణంలోని ఉపరూపకాలకు ఉదాహరణంగా చెప్పిన వాలివధ ప్రేంఖణం, మేనకాహిత రాసకం, మాయాకాపాలిక సంలాపకాదులు ఇప్పు డెక్కడా దొరకవు. విశ్వనాథుడు చెప్పినందువల్ల పేరులైనా తెలుస్తున్నవి, గాని, లేకపోతే అవికూడా 'కథానిక' లవలె పోయిఉండును.

మనవారు ప్రస్తుతం విరివిగా రచిస్తున్న ఏకాంకనాటికకు (One-act play) సమానమయిన అంకరూపకము ఒకటి పూర్వదశరూపకాల్లో ఉండేది. ఉదాహరణగా విశ్వనాథుడే "శర్మిష్ఠాయయాతి" అని ఒక అంకరూపకంపేరు చెప్పాడు. దానిలక్షణం ఇప్పటి ఏకాంకనాటికల లక్షణాలకు దూరంగా ఉన్నా రెండింటి పోకడ మాత్రం ఒక్కటే. చింతా దీక్షితులుగారు సరిగ్గా 'శర్మిష్ఠ' అనే ఏకాంక రూపకం వ్రాశారు, "శర్మిష్ఠాయయాతి" సంగతే యెరుగకుండా. కొన్నాళ్ళపాటు విస్మృతప్రాయమైన అంకరూపకం నేడు రచ్చకెక్కి ఔన్నత్యము పొందినట్టే కొంతకాలం మాటుపడి ఉన్న 'కథానిక' నేడు అభినవసారస్వతులచే ఉద్ధరించబడి, ఎన్నో క్రొత్తలక్షణాలనూ, అందాలనూ స్వీకరించి ఇప్పటి పరిష్కృతస్థితికి వచ్చింది.

అగ్నిపురాణముబట్టి నేను నిర్వచించిన 'కథానికా' ప్రధానలక్షణాలే భారతీయుల 'చిన్నకథ'లలోనూ పాశ్చాత్యుల Short Stories లోనూ, బహుళంగా కనిపిస్తున్నవి.

చూడండి :

వంగకవిశేఖరుడు రవీంద్రుని 'కాబూలువాలా', 'అస్థిపంజరం', 'నమ్మకమైన ఆస్తి', 'ఏటిమెట్లు' మొదలయినకథలలో విచిత్రసన్నివేశాలు, కరుణాలింగితచిత్త మథనలూ, అద్భుతపరివర్తనాలు, కనిపిస్తాయి. శరచ్చంద్రబాబు చాలాకథ లిట్లాంటి వని వినుకలి. సీతాదేవి కథలలో ఈలక్షణాలే విరివిగా ఉంటాయి.

సుప్రసిద్ధాంధ్రకథకులు :

| | |
|---|---|
| శివరామశాస్త్రిగారి | 'అంతర్నాటిక', 'మాలదాసరి' ముద్రలైనవి. |
| మొక్కపాటివారి | 'భిక్షువు', 'శిల్పిద్వయం' వగైరా. |
| సుబ్రహ్మణ్యశాస్త్రిగారి | 'తులసిమొక్కలు', 'ఇద్దరం ఒక్కచోటకే పోదాం' ఇత్యాదులు. |
| బాపిరాజు అడవివారి | 'తిరుపతికొండమెట్టు' |
| కాళూరివారి | 'గృహకల్లోలాలు' |
| వెంకటచలంగారి | 'వేదాంతం' |
| శిరోమణిగారి | 'ధర్మసంస్థాపనం' |
| దీక్షితులుగారి | 'శ్యామల', 'గాలిపటు' |

వంటికథలు శుభ్రమైన కథానికలు.

పాశ్చాత్యకథకులు 'గోర్కీ', 'చకోవ్', 'గాల్స్వర్దీ', 'వెల్స్' మొదలైనవారి కథల్లో చాలావరకూ ఈలక్షణాలు కనిపిస్తాయి.

పాదశతాబ్దికి పైగా భారతీయసారస్వతాల్లో ఉన్నతస్థానమును ప్రాపించిన 'చిన్నకథ' రచన మనకొత్తగ వచ్చినా ఇది మనసాహిత్యాచార్యులు తమ అద్భుత ఉపజ్ఞాప్రతిభలతో గద్యవాఙ్మయమును ప్రస్తరించి సర్వ్చించినదే కాని కేవలం ఒరులదగ్గర ఎరువుగా తెచ్చుకొన్న అపురూపవస్తువు కాదు. దీనికి 'హాస్యకథ', 'పొట్టికథ' అనేపేర్లు Short Story కి ప్రతిబింబప్రాయములుగా వాడడంకంటె, ప్రాచ్యసాహిత్యాలలో నిరూఢమైయున్న 'కథానిక' అనేపేరుతో వాడడం ఎక్కువ ఉచితం. దీనికి తెలుగులో ప్రస్తుతం ప్రచలితమైయున్న 'చిన్నకథ' అనేపేరు కూడా చాల సన్నిహితంగా ఉంటుంది.

*

# కోకిలా !

బొడ్డు బాపిరాజు

స్వేచ్ఛాజీవన వాయువీథులను వాసించున్ భవద్గాన మే
యచ్ఛప్రేమ తపస్సమాధిగతులం దార్జించితో నీవు ? మా
తుచ్ఛస్వార్థపథానురక్త జగదుద్బోధమ్ము, దాస్యవ్యథా
వచ్ఛాంతమ్ముగ జెప్పి పుణ్యమున బోవయ్యా, పికశ్రేష్ఠమా !

సాయంకాల నవప్రవాళరుచిరాశావేదికల్ నీయుపా
ధ్యాయత్వమ్మును గోరి వచ్చు నలగంధర్వాంగనాశ్రేణి నా
ప్యాయంబై కనుపట్టు; తన్మధుర మోదారావముల్ యుష్మము
ద్గాయద్గేయ వరప్రతిధ్వనులపాంకానన్ శ్రవణపేయముల్ !

అవ్యక్తప్రియమాధురీవిలసనా, బానందరాజ్యేందిరా
భవ్యశ్రీపదపద్మ నూపురకలధ్వానమ్ము, శ్రేయోర్థవ
త్కావ్యాలాప సుధాప్రవాహలహరీగాంభీర్యమున్, దివ్యమున్
శ్రావ్యం బౌ భవదీయగాత్ర విభవస్వాతంత్ర్య మర్థించెదన్ !

ఈషత్తిక్తకషాయమంజులము, ప్రహ్వాయస్వరాలాపనో
న్మేషమ్మున్, నవచూతపల్లవము నందించెన్ వసంతుండు సం
తోషస్థానము నీదుగానమున, కేనో పిల్చి విన్పించినన్
'భేషో !' యం చనువాడు లే డొకడు సుమ్మీ పాడులోకమ్మునన్.

విఖ్యాతస్వరకల్పనా లలితవ్యాద్వీణారవ ద్గీతికా
వ్యాఖ్యానమ్ములు, మూఢలక్షణమతుల్ ప్రశ్నింప కా దన్న బ్ర
త్యాఖ్యానంబుగ, నాత్మదోష మది నాయం దుంచినా రింక నీ
సఖ్యమ్మే పరిహార మన్నిటికి, స్వేచ్ఛారాగభాగ్యోన్నతా !

ఊహాప్రోత్థితరాగవీచికలలో నోలాడుచున్, క్షుద్రశం
కాహంకారులమాట మాను ప్రణయవ్యాసంగపారీణు లీ
స్నేహాజ్యోతులచిత్తవృత్తు లెరుగన్ నే ర్పున్నదే ? వట్టివ్యా
మోహావ్యాహత మైనలోకమునకు న్నుల్లంత మైనన్, సఖా !

ఉల్లాసోల్లలదబ్జినీ మధురసాహూతప్రియాళీ సుధా
సల్లాపమ్ములు, నూత్నమార్గముల పంచారించినం గ్రుడ్డిగా
'చెల్లంజాల, వపస్వరమ్ము' లనుచున్ సిద్ధాంతముల్ రచ్చలం
దుల్లేఖించెడివారి కంచు నవి యోహో! సాగిపో కాగునే ?

ఆహ్వానించి మనోజ్ఞభావముల, నాత్మానందసంసిద్ధికై
బహ్వాకారముల న్వెలార్చి, రససంభావ్యస్థితిం దేలుచో
వహ్వా! మూర్ఖజగమ్ము పోల్చుకొనదే! పైపెచ్చు నేమేమొ దు
ష్కహ్వాంబుంబలె మాటకేన్ వికివికల్ చాటించురా! మిత్రమా!

కాశ్మీరాంబర భూషితాంబుధరరా ట్కన్యాసముత్సాహసం
వేశ్మప్రాగ్గిరిసాను లాస్యవిలస ద్వేళాపత త్పుష్యరా
గాశ్మోద్దీపిత హేమకంకణరవ వ్యావృత్తకృద్గీతికా
రశ్మిస్తోమము దుర్విమర్శకుల వ్యర్థాలాపముల్ మాపుతన్!

ఉద్యద్వసంతసార
భవ్యద్యోతశ్రీప్రభాతభాస్వద్గీతా
మద్యాస్వాదనసన్నిహి
తోద్యోగులకున్ శుభమ్ము లొసంగుత మనకున్!

*

# నాలో మార్పు

శ్రీ శివశంకర శాస్త్రి

౧

అలవాటుపడ్డ మార్గంలో వెళ్ళడం తేలిక. చిరకాలానుభవముమీద సక్రమ మని తేలిన ఛందోమార్గాలను అనుసరించి పద్యం చెప్పడం కష్టం కాదు. సరస మైన వచనరచన చెయ్యడం కొంతకష్టముతో కూడినపని. అందుకనే 'గద్యం కవీనాం నికషో వదన్తి' అన్నారు అభిజ్ఞులు.

సామాన్యంగా సకళహృదయులకు పద్యమే అప్రయత్నంగా పలుకుతుంది. భావోద్రేకాన్ని ప్రకటించడానికి గద్యంకన్న పద్యమే ఉత్తమము. నాకుకూడా చిన్నతనంలోనే ఛందోవిషయము తెలియకముందే అప్రయత్నంగా ఒకనాడు పద్యం బయలుదేరింది. తరువాత కొన్నిసంవత్సరాలకు నాటకరచనకు పూనుకొన్నప్పుడు వచనంతో ప్రసక్తి కలిగింది. 'నాటకాన్తం కవిత్వం' అని పెద్దలన్నప్పటికీ, చాలామంది బాల్యవశంచేత నాటకరచనతో సారస్వతజీవనము ప్రారంభిస్తారు.

నాటకప్రదర్శనాలు చిన్నతనంలో ఎక్కువగా చూడడం తటస్థిస్తుంది. లేత మనస్సులు వాటికి లోబడి, నాటకభాగాలను కుర్రవాళ్లు ఇళ్ళలో తిరిగి ప్రదర్శించడము చాలామందికి తెలుసును. అదొకకారణము కావచ్చు. లోకవృత్తము మహానాటకమువలెనే వుంటుంది. పరిసరాలను సన్నివేశాలను కొంచెము పరిశీలన దృష్టితో చూచేకుర్రవాళ్ళకు కూడా నాటకవిధానంమీద అభిలాష కలగడం సహజము. తరవాత, పాఠశాలల్లో పెద్దనాటకాలలోంచి ఒకటిరెండు రంగాలు పాఠ్యపుస్తకాలలో చదవడమూ, ఉపాధ్యాయుల ఆనతిమీద పాఠశాల- ఉత్సవాలలో ఏదో ఒకటి విద్యార్థులు ప్రదర్శించడమూ సామాన్యముగా జరిగేదే. కథాప్రాయంగా శ్రవణయోగ్యంగా చెప్పుకొంటూ వెళ్ళే ఇతివృత్తంకంటె నయనగోచరంగా నటించే వృత్తమే అందరికీ - అందులో ముఖ్యంగా చిన్నవాళ్ళకు - వెంటనే నచ్చుతుంది. ఇవన్నీ కాకుండా పాఠశాలల్లో 'షేక్స్పియర్' నాటకాలవెర్రి అపరిమితము. ఆనాటకకథలు, కొన్నికొన్నినాటకాల్లో రంగాలూ పాఠాలకింద నూరిపోస్తారు. ప్రపంచంలో కవులందరికంటే 'షేక్స్పియర్' గొప్పవాడని చిన్నతనంనుంచీ ఉపాధ్యాయులు తల కెక్కిస్తారు. నేను రెండోఫారము చదువుతూ వుండే రోజుల్లో మాయింగ్లీషు ఉపాధ్యాయుడు జ్యోస్యుల కృష్ణయ్యగారు పాఠం చెబుతూ ఏదో సందర్భంలో 'షేక్స్పియర్' సంగతి చెప్పి 'ఆయన నాటకా లన్నీ చదివితే

నీలాంటివాడొకడు ఎక్కడోక్కడ కనిపిస్తాడు' అన్నారు. వెంటనే చాలామంది విద్యార్థులము 'మేమందరమూ, ఉన్నామా?' అని ఏకగ్రీవంగా అడిగాము. 'నిస్సంశయంగా' అని ఆయన చెప్పినారు అప్పటినుంచీ నాకు 'షేక్స్పియరువెర్రి' పట్టుకొని తరువాత చాలాసంవత్సరాలదాకా వదల లేదు. ఏగ్రంథకర్తమీా నైనా గౌరవం ఎక్కువుంటే అతనిపద్ధతి అనుకరించడం గాని, అతనిగ్రంథం ఏదైనా అనువదించడం గాని సంభవిస్తుంది. నాకు పట్టినవెర్రిలో షేక్స్పియరునాటకాలు ఆవయస్సులో సరిగా అర్థమవుతయ్యా, ఇవి నావంటివాడు చేయదగినపనా అని యోచన చెయ్యలేదు.

1908 లో 'A Mid Summer Night's Dream' అనువదించడం ఆరంభించాను. ఇప్పుడు తలుచుకుంటే నవ్వు వస్తుంది. అప్పుడుమట్టుకు ఆనాటకం తెలిసినట్టే వుండేది. ఆరోజుల్లో మెట్రిక్యులేషన్ తరగతి ముగించాను. మాతృకలో నాకు కలిగే సంశయాలు నివారణ చేసుకోడానికి టిప్పణులు వ్యాఖ్యానాలు కొన్ని చదివాను. ఈనాటకమే ముందుగా ఎందుకు స్వీకరించానో గట్టిగా చెప్పలేను. కాని ఇప్పటికీ లౌకికప్రపంచంలో జరిగే సామాన్యవిషయాల కన్న అలౌకికప్రపంచంలో సంభావ్య అసంభావ్య విషయాలమీాదికే మనస్సు ఎక్కువగా ప్రసరిస్తుంది. అదొకహేతువు కావచ్చును. ఆవయస్సున 'Arabian Nights Entertainments' పుస్తకప్రభావము నామీాద ఎక్కువగా ఉండేది. అందుచేత ఈనాటకం వ్యామోహపెట్టి ఉంటుంది.

రచనావిధానం ఎలాగని జిజ్ఞాస కలిగింది. 1903 సంవత్సరంలో నాకు సంస్కృతము రాదు. అయినప్పటికీ అనేక సంస్కృతశబ్దార్థాలు మాత్రం కరతలామలకంగా ఉండేవి. సంస్కృతనాటక అనువాదాలు దొరికిన వన్నీ అప్పటికే చదివాను. ఆ సంవత్సరంలోనే మాఅన్నగారివెంట రాజమహేంద్రవరం కొత్తగా వెళ్లి వడ్డాది సుబ్బారాయుడు గారిని ప్రథమపర్యాయము సందర్శించాను. అదివరకే వారి 'వేణీసంహారము' 'ప్రబోధచంద్రోదయం' 'చండకౌశికం' చదివాను. సుబ్బారాయుడుగారు నూతనంగా ప్రకటించిన 'అభిజ్ఞానశాకుంతలం' బహుశా 'మల్లికామారుతం' స్వయంగా ఇచ్చారు. సంస్కృతమాతృకలకు అవన్నీ అనువాదాలు. ఆపద్ధతి తలకెక్కింది. పూర్వమే వీరేశలింగకవి నాటకాలన్నీ శ్రద్ధతో చదివాను. కాకినాడలో 'సరస్వతీపత్రిక' వారినడ్డ 'ముద్రారాక్షసము', 'మృచ్ఛకటికము' తరవాత 'బాలరామాయణము' పుచ్చుకొని సవిమర్శనంగా పఠించాను. ఇవన్నీ తిరుపతి వేంకటేశ్వరకవుల ఆంధ్రీకరణాలు. అదివరకు చాలాపూర్వమే దాసు శ్రీరామకవి తెలిగించిన 'మాలతీమాధవ', 'మహావీరచరిత్రాది నాటకాలు మన

స్సనకు పట్టేఉన్నవి. అన్నిటికంటె ముఖ్యమైనది సంస్కృతవిద్వాంసు లైన మా నాయనగారూ, పెత్తండ్రిగారూ సంస్కృతనాటక ప్రాశస్త్యాన్నిగూర్చి తరుచుగా మాట్లాడుతూ వుండడంవల్ల ఆపద్ధతే సర్వోత్కృష్ట మైన దని విశ్వాసం కలిగింది.

అయితే షేక్స్పియర్ నాటక అనువాదంలోకి ఈపద్ధతి ఎలా ప్రవేశపెట్టడము అనేది గట్టిచిక్కుగా పరిణమించింది. సామాన్యంగా ఆంధ్రుడు యథామాతృకంగా ఏదీ తెలిగించడానికి సంకల్పించడు. నేనూ అదేవిధంగా కొంత ఆంగ్లకవివిధానము, కొంత ప్రాచీననాటకవిధానము కలగాపులగము చేసి ఏదో వ్రాశాను. పద్యభాగం సుగమంగా వెళ్ళింది. వచనం వచ్చినప్పుడు పెద్దసంశయం పట్టుకున్నది. అదివరలో చదివిన చిన్నయసూరి 'నీతిచంద్రిక' వడ్డాది సుబ్బారాయుడుగారి 'సుమనోమనో జ్ఞము' చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నవలలు- వీటిలో ఉండేవచనములాటిది రాయనా వద్దా అని తికమకపడ్డాను. సంస్కృతనాటకాలలో నీచపాత్రలకు ప్రాకృతం వాడినట్టు తెలుసుకొన్నాను. అందుచేత ఈనాటకాలలోకూడా నీచపాత్రలకు సామాన్యభాష వాడినాను. ఈవిధంగా ఆనాటకం మూడంకాలు తెనిగించినట్టు జ్ఞాపకం.

వచనరచనలో ఎటువంటిభాష వాడాలని సంశయము చాలామందికి రాదు. అనేకులు గతానుగతికంగానే వెళ్ళుతూ ఉంటారు. నాకు ఇటువంటి సంశయము కలగడానికి కారణం ఏ మయి ఉంటుం దని ఆలోచిస్తే, 'నీతిచంద్రిక' మొదలైన వాటిలో భాషకంటె వీరేశలింగకవి ప్రహసనాలలో భాష, భుజంగరావుగారి ప్రహసనాలలో భాష సహజంగా సరళంగా హృదయంగమంగా ఉండడమే. సారస్వతంలో స్వయంగా కృషిచేస్తూ వెళ్ళడమేగాని ఇతరుల సలహాగాని సహాయంగాని ఆరోజులలో లేదనే చెప్పవచ్చు. అప్పుడు నాకు కలిగిన ఊహలప్రకారం వ్రాస్తుండే వాణ్ణి.

1908 లో 'సరస్వతి' పత్రికలో 'కన్యాశుల్కనాటక' విమర్శన పడ్డది. అప్పారాయకవిపేరు మొదటిసారి తెలియడం అదే. ౧౯౧౪ లో కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్సమావేశానికి వెళ్లినప్పుడు గాని గురజాడ అప్పరాయకవిసందర్శన భాగ్యం లభించలేదు. మళ్ళీ ఆయనను చూడడం పడనే లేదు. మరుసటిసంవత్సరమే ఆయన పరమపదించారు. కన్యాశుల్కగ్రంథము చూడకముందే విమర్శవల్ల దానిమీద సదభిప్రాయం ఏర్పడ్డది. తరువాత 1909 లో మొదటిసారి చదివినప్పుడు నాలో ఏదోమార్పు కలిగింది. పరివర్ధితముద్రణమే కాక ఆదిముద్రణముకూడా లభించింది. మొదటిముద్రణంకన్న రెండవది సర్వవిధాలా నాకు బాగున్నట్టు తోచింది. ఆనాటకము మొదటిసారి చదివినవాళ్ళు ఎవరైనా సరే ఆశ్చర్యపడి

ఏదో కొంతమార్పు పొందకుండా ఉండలేరు. అప్పటికి గ్రామ్య గ్రాంథికభాషా వివాదం బయలుదేరలేదు. తర్వాత వేదం వేంకటరాయశాస్త్రిగారి 'ప్రతాపరుద్రీయం' చదవడము సంభవించింది. దాంతోటి వాడుకభాషమీద అనురాగమే కాకుండా ఆదరమూ అభిమానమూ హెచ్చినవి.

అప్పటికే 'మూఢభంజన' మనే మూడంకాల సాంఘికనాటక మొకటి వ్రాశాను. కాజగ్రామంలో మేడూరి నరసింహాచార్యులు అనేమిత్రుడి ప్రోత్సాహం వల్ల ఆనాటకం వ్రాయడం సంభవించింది. నరసింహాచార్యులు విద్వాంసుడూ సత్కవీ కాకపోయినా, కొన్ని జంగంకథలూ నాటకాలూ వ్రాసి నాటకరచనలో నాకు ఉత్సాహం ఇచ్చాడు. అందులో ఇతివృత్తము సాంఘికము. అయితే అతని కోరి కనుబట్టి కొంతదూషణ, హేళన యిమిడ్చాను. ఆరోజుల్లో తిరుపతి వేంకటేశ్వరుల 'శనిగ్రహం' చదవడంకూడా కొంతవరకు కారణం.సమగ్రంగా వ్రాసిన ఆనాటకం Satarical కావడముచేత చించివేశాను. నాకు ఇప్పటికీ Satire అంటే ఇష్టం లేదు. ఒకరిని ఇంకొకరు హేళన చేస్తుంటే సహించడం కష్టంగా ఉంటుంది. హేళనకావ్యాలకు సారస్వతవిభాగంలో స్థానం ఉన్నప్పటికీ అది అధమస్థానమేఅని రసజ్ఞులు నిర్ణయించారు. ఒక్కొక్క బుద్ధికి ఒక్కొక్కటి నచ్చదు. నాటినుంచి నేటివరకూ అటువంటిరచన మళ్ళీ చేయలేదు.

అంతకు పూర్వమే మనుచరిత్ర చదివినప్పుడు అందులో మొదటిమూడాశ్వాసాలకథ నాటకరూపంగా రాతామనుకొని ప్రారంభించి వచనభాగం కొంత రాశాను. అందులో గ్రాంథికభాష వాడినట్లే జ్ఞాపకం. వాడుకభాష ఎందుకు రాయలేదో చెప్పలేను. వ్రాసిన కొన్నిపద్యాలు మనుచరిత్రలో కొన్నిపద్యాలకు నకళ్ళే. గ్రంథాదిలో ఉన్న "శ్రీవక్షోజ కురంగనాభ మెదపై జెన్నొంద విశ్వంభరాదేవిన్" అనే పద్యాన్ని "సిరివిరిబోణి యురస్థలమందున జెన్ను వహించు కురంగమదంబు" అంటూ కవిరాజవిరాజితములోకి మార్చాను. ఈవిధంగా తయారైనవి కొన్నిపద్యాలు. మనుచరిత్ర మొదటిపర్యాయము చదివినప్పుడు ముగ్ధులు కానివారుండరు. అందులో యౌవనోదయ మయ్యేసమయంలో ఆకావ్యం చదివినవాళ్ళు మరీ ఉద్రిక్తహృదయులైపోతారు. అందుచేతనే నేనుకూడా వ్యామోహంలో పడిపోయి దాన్ని కొంతవరకు నాటకం చేశాను. ఇంతలోకే రొద్దం హనుమంతరావుగారి "స్వారోచిషము" అనేనాటకం నాచేతుల్లో పడ్డది. అదేమీ రుచైన పుస్తకం కాదు. కాని దానివల్ల నా కొకగొప్పఉపకారం జరిగింది. మనుచరిత్రమీద మనస్సు తిరిగిపోయింది. రాసినగ్రంథానికి చెయ్యవలసిన సంస్కారం - దహనసంస్కారం - చేశాను.

తర్వాత ప్రారంభించిందికూడా నాటకమే. షేక్స్పియరు విరచితమయిన "Two Gentlemen of Verona" అనువదించడం ప్రారంభించాను. మామూలు ఆంధ్రుడు చేసేటట్టే మాతృక నంతా తికమకచేసి దానికి 'కాదంబిని' అని పేరుపెట్టి చాలావరకు రాశాను. అంతకుపూర్వము వర్డ్సువర్తు 'Borderers' నాటకం చదవడం, అది బాగున్నది అనుకోడం, కొద్దిగా దానిలాగే ఈనాటకం అక్కడక్కడ ఉండడం స్వీకరించడానికి కారణమై ఉండవచ్చు. అప్పుడు నాదగ్గిర ఉన్న Shakespeare నాటకసంపుటిలో ఇదే మొదటిదిగా అచ్చుపడడం ఒకహేతువుగా ఉండవచ్చు. "కాదంబిని"లో వచనభాగం చాలావరకు వాడుకభాషలోనే ఉన్నది. ప్రతాపరుద్రీయం చదివితే అందులో

"ఆయన యిందర్ చందర్
ఆయన జూలీసుసీజ రాలీసాందర్
ఆయనమోం చూస్తుంటే
ఆయనబాత్ వింటువుంటె అది సాల్ నాకీ"

అనేపద్యం ఎందుకో గాని చెవులలో మారు మోగటం మొదలుపెట్టింది. అదే కాకుండా వేంకటరాయశాస్త్రిగారే తెలుగుచేసిన 'నాగానందంలో' ఒకపద్యంలో "బలదేవు డొక్కడుర సిత్తబవు డొక్కడురా" అనే పద్యం బాగా ఉన్నట్టు తోచింది. అంతటి విద్వాంసుడే ఇలాటి పద్యాలు రాసినప్పుడు నే నెందుకు రాయగూడదని 'కాదంబిని'లో కొన్ని రాశాను. ఇప్పటికీ ఒక్కపద్యం జ్ఞాపక మున్నది.

ఈలే దోడబ్బైనా
సాలా మంచమ్మవోరు సాల్ సాల్ బత్లే
మీలాంటి పెబువు లైతే
సాలా బవ్రమాన మిస్త్రు సంతోసంతో.

ఇలాంటి కవిత్వం బయలుదేరింది. పాత్రోచిత మైనభాషలో పద్యాలు ఎందుకు రాయకూడదని ఇలా రాసి ఉంటాను. ఆరోజుల్లో వేంకటరాయశాస్త్రిగారి రచనాప్రభావం చాలా ఉండేది నామీద.

Shakespeare ఉత్తమశ్రేణినాటకా లుండగా 'Winters Tale' అనువదించడానికి ఎందు కారంభించానో నాకే తెలియదు. 1907వ సంవత్సరములో బాపట్లహైస్కూల్లో చదివేటప్పుడు ఏదో ఉత్సవంలో 'King John' లోనూ 'Julius Caesar' లో నేను పాత్రధారణం చేశాను. ఇప్పటికీ అందులో మహాపురుషుల మీద గాని ఆనాటకంమీదగాని ఆదరం తగ్గలేదు. కుర్రతనంలో యుక్తాయుక్త

8

వివేకం సరిగా ఉండదు. కాబట్టి చాలా సామాన్యమైన నాటకం తెలుగుచేయడం ప్రారంభించాను. నాకు అదృష్టవశాత్తు విఘ్నదేవత సహాయానికి వచ్చింది. నా రచన ఎందుకు ఆగిపోయిందో జ్ఞాపకంలేదు. మొత్తంమీద ఆరోజుల్లో Shakespear నాటకాలు కొన్ని వ్యాఖ్యానాదులతో సవిమర్శకంగా చదవడం సంభవించింది. ఆసంవత్సరంతో షేక్సుపియరుకు స్వస్తిచెప్పినా అతని గ్రంథాలు తెలిశో తెలియకో చదివిన సంస్కారం మట్టుకు మిగిలింది.

ఆయేడు బాపట్లలో మిత్రవర్గం పెరిగింది. శిష్యులుకూడా ఏర్పడ్డారు. రోజూ సాయంకాలం తప్పకుండా గోష్ఠి జరుగుతుండేది. వాళ్ళ కుషామత్తుకోసం నేను చదివిన కొత్తపుస్తకంలో సంగతులు వాళ్ళకు చెప్పేవాణ్ణి. చేసిన కొత్తపద్యాలు చదివి వినిపిస్తూ ఉండేవాణ్ణి. అప్పుడుకూడా నాటకాలే ఎక్కువ చదవటం సంభవించింది. Wilson ఇంగ్లీషుచేసిన సంస్కృతనాటకాలు మాఅన్నగారు తెప్పించి ఇంట్లో ఉంచారు. అవన్నీ నేను స్నేహితులకు చదివి వినిపిస్తుండేవాణ్ణి. అవే కాకుండా తిరుపతి వేంకటేశ్వరకవులు, వేదం వేంకటరాయశాస్త్రిగారు ఆంధ్రీకరించిన సంస్కృతనాటకాలుకూడా జాగ్రత్తగా పఠించాను. ఏదో సందర్భంలో "రత్నావళి" ఇంగ్లీషుది ప్రదర్శించడానికి మిత్రులు నిర్ణయించారు. అందులో నాకు రత్నావళిభూమిక ఇచ్చారు. అన్నివిధాలా బాగా తయారైనాము. పట్నంలో ఈ నాటికనుగురించి బాగా ప్రచారం చేశారు. అప్పుడే వస్త్రున్నమీసాలు తీసివేసి రత్నావళివేషం వేసుకున్నాను. రాత్రి తొమ్మిదిగంట లయింది. అరగంటలో ప్రదర్శనం ప్రారంభించాలి. ఇంతలోకే ఏదో కబురు వచ్చింది. మిత్రులు ప్రదర్శనం ఆపవలసిం దన్నారు. ఆశాభంగ మయింది.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య 1907 లో హరిశ్చంద్ర మొదలైన నాటకాలు ప్రదర్శనకు తయారుచేశాడు. నేను అందులో పాత్రధారణ చెయ్యలేను. హరిశ్చంద్రనాటకం నాకు నచ్చలేదు. అయితే 1909 లో మిత్రబృందము ఇంగ్లీషులో హరిశ్చంద్ర ప్రదర్శించినప్పుడు నేను ఏదో తోడ్పడ్డాను. ఇంగ్లీషుపుస్తకాల్లో మూగానాం తేలానాంగా ఉండటంచేత ఇంగ్లీషులో పద్యాలు రాసేవాణ్ణి.

ఆరోజుల్లో మాది అంతా నాటకప్రపంచం. ఏనాటకకంపెనీవాళ్ళు వచ్చినా ప్రతిప్రదర్శనానికీ మాబృందం తయారు. ఇంత ఉత్సాహంలో వున్నా నేను నాటకం ఏమీ రాయలేదు. మంచినటులను ప్రశంసిస్తూ పద్యాలు మట్టుకు రాసేవాణ్ణి.

గ్రామ్యగ్రాంథిక భాషావివాదం బయలుదేరక పూర్వమే నాటకాలలో వాడుక భాష ఉపయోగించ వచ్చునని విశ్వాసం కలిగింది. వచనగ్రంథాలలో అటువంటి

భాష వాడవచ్చునా వాడకూడదా అనే జిజ్ఞాస కలగ లేదు. అలా కలక్కపోవడానికి కారణం వచనగ్రంథం రాయవలె ననే అభిలాష లేకపోవడమే.

ఆసంవత్సరం కథలు నవలలు కూడా చదివాను. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారి నవలలు, రామానుజశర్మగారి "కథాకల్లోలిని", ఎవరిదో 'కాశీమజిలీలు', వెంకటరాయశాస్త్రి గారు తెలిగించిన "కథాసరిత్సాగరము" జ్ఞప్తిలో ఉన్నవి. ఇంకా ఏమి చదివానో చెప్పలేను. వచనంకన్న పద్యంమీదనే ఎక్కువప్రీతి కావడంచేత పద్యరచనే చేస్తూ ఉండేవాణ్ణి.

సంస్కృతం నేర్చుకుంటే బాగుండు నని సంకల్పం కలిగింది. ఆభాష రాక పోయినా ఇంట్లో ఉన్న "శిశుపాలవధ", టీకాతాత్పర్యసమేతమైన మేఘదూతమ్ము, ప్రియదర్శిక, రత్నావళి, ముద్రారాక్షసము తరుచుగా తిరగవేస్తూ ఉండేవాణ్ణి. అప్పుడప్పుడు కర్లపాలెం నారాయణప్పగారు అనేమిత్రుడు "పాండిత్యహీనాః కవయో భవంతి" అంటూ ఉండడం—

"విద్వత్కవయః కవయః
కేవలకవయః కేవలం కపయః
విద్వన్మహిషీ మహిషీ
కేవలమహిషీ తు కేవలం మహిషీ"

అని చదివి భావం తలకు ఎక్కించడంచేతనూ విద్వత్తు లేనిది లాభంలేదను కొన్నాను. నారాయణప్పగారు సంస్కృతవిద్వాంసుడు. సూత్రభాష్యాది అద్వైత గ్రంథజాలం పఠించినవారు, సహృదయులు. ఆరోజుల్లో ఆయన విద్వాంసుడు కాక పోయినా, సరసుడూ నాకంటె పెద్దవాడూ కావడంచేత ఆయనఉపదేశం స్వీకరించి అదివరలో రాసినగ్రంథాలు, గ్రంథభాగములూ సమస్తమూ దహనం చేసి విద్యావ్యాసంగానికి పూనుకొన్నాను.

బాపట్లలో కంభంపాటి సీతారామశాస్త్రి గారికి మంచిపేరుండేది. అదివరకు హైస్కూల్లో నేను చదువుకునేటప్పుడు సీతారామశాస్త్రిగారు సంస్కృతవిద్యార్థులకే పాఠం చెప్పేవారు. నేను తెలుగుచదువుతూ ఉండడంవల్ల ఆయనవద్దకు వెళ్ళడానికి అవసరం లేకపోయింది. తరవాత నేను ఒకనాడు వెళ్ళి సంస్కృతము నేర్పవలసిందని ప్రార్థిస్తే కుమారసంభవము ప్రారంభం చేశారు. మొదటిసర్గలో 32 శ్లోకాలవరకు పాఠం సాగింది. అంతరాయం ఎందుకు వచ్చిందో జ్ఞాపకం లేదు. అప్పటి నుంచీ సంస్కృతపువెర్రి పట్టుకొంది.

## ౨

కొన్నిరోజులు బాపట్లనాటకసమాజాలవారితో కాలక్షేపం చేసి 1910 లో తెనాలిలో ఉండడం ప్రారంభించాను. అక్కడ హైస్కూలులో వేదాన్తం శ్రీరామశాస్త్రి గారు సంస్కృత పండితుడు. ఆయన మాకు బంధువు, మంచివిద్వాంసుడు. నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి శిష్యుడు. సంస్కృతము చదవడానికి వారిదగ్గిరికి వెళ్లాను. మండలమురోజులలో అన్వయజ్ఞానము కలిగిస్తా నని ఆయన శపథము. కిరాతార్జునీయము ప్రారంభించారు. గాఢాభిమానంతో పాఠం చెప్పేవాడు. ఆయన పెట్టిన గడువు దాటకముందే అన్వయజ్ఞానం కలిగింది. కావ్యంతోపాటు 'చంద్రాలోక' సహితమైన 'కువలయానందము' కూడా పాఠము చెప్పినారు. సంస్కృతభాషాజ్ఞానంలోనూ, సాహిత్యమర్యాదలలోను గట్టిపునాది పడ్డ దంటే ఆయనదగ్గిరనే. గీర్వాణసాహిత్యంలో శ్రీ రామశాస్త్రి గారు నాకు కలిగించిన అభినివేశానికి ఎప్పటికీ కృతజ్ఞుడను.

ఆరోజుల్లో అట్టే తెలుగుపుస్తకాలు ముట్టుకున్నట్టు జ్ఞాపకం లేదు. హామేషా సంస్కృత గ్రంథావలోకనతోటే కాలం గడిచిపోయేది. సహజంగా కలిగిన సంస్కృత భాషాభిమానానికితోడు, మాబావమరది నేతి నరసింహశాస్త్రిగారు చాలా ఉత్సాహం ఇస్తుండేవాడు. అసలు నేను తెనాలిలో ఉండడానికి కారణం ఆయనే. నాకు వివాహము ఐనదిమొదలు పదిసంవత్సరాలవరకూ ఆయనప్రభావము నామీద చాలా హెచ్చుగా ఉండేది. ఆయన బి. ఏ. సంస్కృతములో ప్యాసుకావడమే కాక, తండ్రిగారివద్ద సంస్కృతం చదువుతూ ఉండేవాడు. 1905 సంవత్సరములో ఆయన 'శ్రీకంఠచరితమ్' చదువుతున్నప్పుడు నేను వింటూ ఉండేవాణ్ణి. ఆభాష రాకపోయినా శ్రవణమాత్రంచేత అనేకశ్లోకాలు కంఠస్థ మైనవి. 1910 లో ఆయన త్రివిక్రమభట్టు విరచితమైన 'దమయంతీకథ' మీదను విదర్భరాజ విరచితమైన 'చంపూరామాయణము' మీదను, శాకున్తలము మీదను ఎక్కువ అభిమానము కల్గించాడు.

నరసింహశాస్త్రిగారు సంస్కృతశ్లోకాలు మామూలు విద్వాంసులవలెగాక వింతగా శ్రావ్యంగా చదివేవాడు. అనుష్టుప్ మొదలుకొని స్రగ్ధరవరకూ ఆయన కర్ణరంజకంగా అనేవాడు. ఆబాణీ నాకు కొంతవరకు పట్టుబడ్డది. 'దమయంతీ' కథలో,

"వాంచః కాఠిన్య మాయాన్తి
భంగ శ్లేష విశేషతః
నో ద్వేగః తత్ర కర్తవ్యః"

అన్న శ్లోకభావము మనస్సులో నాటుకుపోయి, ఇప్పటికీ ప్రౌఢోక్తిమీద అభిమానం సడలనియ్యడం లేదు. ఆరోజుల్లోనే ఆయనసలహామీద, వాదీభసింహవిరచితమైన 'జినచరితమ్' చదివాను. అది గద్యకావ్యము. నేను చదివిన ప్రథమగద్యకావ్యం అదే.

'జినచరితం'లో తొమ్మిది లంబకా లున్నట్టు జ్ఞాపకం. ప్రతిలంబకం వివాహంతో ముగిసేది. అందులో దీర్ఘవాక్యాలు నాకు చాలానచ్చినవి. పదాడంబరం, సమాసజటిలత, మొదలైనగుణాలను గురించి విస్తరించి చెప్పక్కర్లేదు. అనంతభట్ట ప్రణీతమైన 'భారతచంపువు' లో వచనాలు చిన్నతనంలో మానాయనగారు చదివి వినిపిస్తూంటే కొన్నివచనాలు నోటికి వచ్చినవి. ఇంట్లో తరుచుగా చదివే ఆంధ్రభాగవతంలో గజేంద్రమోక్షణలో కాననవర్ణనము, గంగాప్రవాహ వర్ణనము, నృసింహావిర్భావ ఘట్టము, ఇంటువంటివన్నీ చెవుల్లో మోగుతుండేవి. కాని నిజంగా వచనం మీద ప్రేమ కలిగింది 'నలచంపులో' ఉండే వచనభాగాలవల్లనే.

ఆ తరువాత సుబంధుని 'వాసవదత్త', బాణుని 'కాదంబరి', చదవడం సంభవించింది. ఎందుచేతనో 'వాసవదత్త' మీదనే చాలాకాలం అభిమానం ఉండేది. 'దశకుమారచరితము' మీద ఇప్పటికీ ప్రీతి తక్కువే.

గద్యగ్రంథాలకోసం ప్రయత్నం చేశాను. గ్రంథకర్తపేరు జ్ఞప్తి లేదు, కాని 'హరిశ్చంద్రచరితమ్', 'శ్రీకృష్ణలీలాయితమ్' అనే రెండు సంస్కృతగద్యగ్రంథాలు లభించినవి. సంస్కృతవచనంమీద అభిమానం హెచ్చిపోయింది.

'సహృదయ' 'మంజుభాషిణి' అప్పశాస్త్రిగారి సంస్కృతపత్రికలు తిరగవేస్తూ ఉండేవాణ్ణి. వచనరచనమీదికి బుద్ధి పోతూ ఉండేది. కాని వచనం చెయ్యబోతే పద్యం వచ్చేది. Longfellow కవితాలూకు ఖండకావ్యం ఒకటి సంస్కృతంలోకి కొంతవరకు అనువదించాను. ఒకపద్యంలో కొంతభాగం ఇప్పటికీ జ్ఞాపకం ఉన్నది.

> అద్రాక్షీ స్మహతీం నృపాలభవనద్వారోపకంఠస్థితాం
> ఘంటాం ... ...
> కశ్చి ద్వృద్ధతురంగమో నిజగృహా న్నాథేన నిష్కాసితః
> ఘాసాస్వాదనతత్పర స్తత ఇతో భ్రామ్యన్ ప్రచండాతపే.

ఈమోస్తరుగా ఉండేది.

శివాజీపేరు విని ఉత్సాహభరితుడు కానిభారతీయుడు లేడు. యువకులవిషయమై వేరే చెప్ప నక్కర్లేదు. నాకు శివాజీవిషయమై గాఢాదరం ఉండేది. అఫ్జుల్

ఖానును శివాజీ మోసగించి చంపాడని వ్రాసిన చరిత్రకారులవ్రాత విశ్వాసయోగ్యంగా నాకు తోచలేదు. అఫ్‌జుల్‌ఖానువధ సంస్కృతకావ్యంగా ఆరంభించాను.

కృతప్రతిజ్ఞః కుపితః ప్రతాపవాన్
అదిల్‌షహో బీజపురాధినాయకః
మహాచమూం పంచసహస్రవాజిభిః
సమన్వితాం సప్తసహస్రపత్తిభిః—

అంటూ ఏదో వ్రాశాను. బాల్యచాపలంచేత చేసినరచన లన్నీ చించివేశాను.

కవి కావా లనిగాని గ్రంథాలు చెయ్యవలె నని గాని ఆరోజుల్లో ఉద్దేశ్యమే లేదు. మాపూర్వులవలెనే విద్వాంసుణ్ణి కావలెననీ, షడ్దర్శనములు చదువుకోవలె ననీ, విశేషించి వేదాధ్యయనముకూడా చెయ్యవలె ననీ గాఢాభిలాష ఉండేది. అయితే జాతకరీత్యా విద్యావిఘ్నము ఉండడముచేత ఏదీ తిన్నగా సాగలేదు.

సంస్కృతసాహిత్యంలోమాత్రము బుద్ధి విశేషంగా ప్రసరించింది. వ్యాకరణము అభ్యసించాలని ఎన్నిప్రయత్నాలు చేసినా ఏదో ఒక అంతరాయము వచ్చేది. చిన్నతనంనుంచీ వ్యాకరణ మంటే చాలా యిష్టం. 'సిద్ధాన్తకౌముది' చదవకపోతే సాహిత్యానికి చాలా లోటని పెద్దలు చెబుతుంటే విన్నాను. తిరుపతి వేంకటేశ్వర కవులు "అ ఇ ఉ ణ్ మొదలుగాగ ఆభాష్యపర్యంత మేమహామహుడు మా కిచ్చె విద్య" అని ఒకచోటా, 'అల పతంజలికృతం బైనభాష్యమునకే పరిఢవిల్లును మహాభాష్యపదము' అని ఒకచోటా, చెప్పినపంక్తులు చదివినప్పటినుంచీ వ్యాకరణం మీద అభిమానం హెచ్చింది. ఎంత అభిలాష ఉన్నా మూడుసంవత్సరాలు గడిచేదాకా 'అష్టాధ్యాయి' ముట్టుకోవడం సంభవించ లేదు.

బాపట్లలో ఉన్నరోజుల్లోనే భండార్కర్ 'మార్గోపదేశిక' చదివి, ఆయన ఫోటోగ్రాఫు, చేవ్రాలుకోసం ఉత్తరముకూడా వ్రాసి, ధైర్యము చాలక పోస్టులో వెయ్యలేదు. ఆరోజుల్లోనే సంస్కృతభాషా సారస్వతాలలో పరిశోధనచేసిన విద్వాంసుల వ్యాసాలు చదవడంవల్ల వాటిమీద అభిమానాంకురా లేర్పడ్డవి. బాపట్ అనేమహారాష్ట్ర విద్వాంసుని సంస్కృతవ్యాకరణము, ఇంకోదాక్షిణాత్య పండితుని 'ధాతురూపముక్తావళి' మొదలైనవి పఠించడంవల్ల కొంతవ్యాకరణజ్ఞానం కలిగింది. ఆప్టే, కాళే, కీల్‌హారన్, మొదలైనవారి వ్యాకరణాలు తరవాత కొన్ని సంవత్సరాలకు గాని చూడలేదు. ఆవ్యాకరణగ్రంథాలు చదువుతూ ఉన్నప్పుడు వైదికసంస్కృతభాషమీద అనురాగం అంకురించింది.

ఆసంవత్సరం కావ్యాలూ చంపువులే కాక సంస్కృతనాటకాలుకూడా గురు సన్నిధానంలో కాక స్వయంగా చదివే వాణ్ణి. బావమరదివల్లను, Goethe మహాకవి జర్మన్‌తర్జుమా చదివి ఆనందపరవశుడై నాట్యం చేసి ప్రశంసిస్తూ వ్రాసినపద్యం చూడడంవల్లనూ, 'అభిజ్ఞానశాకుస్తలము' మీద మహాప్రీతి ఏర్పడ్డది. రెండుమూడేళ్ళకిందటే శాకుంతలానికి ఆంధ్రానువాదాలు చదివి ఉండడం చేత నాటకంమీద ఇష్టం ఉండేది. గీర్వాణభాషామాధుర్యంవల్లా కాళిదాసమహాకవి రచనావిధానంవల్లా శాకుంతలము మరీఅభిమాననాటక మయింది. అన్నిటికన్నా యౌవనోదయకాలంలో ఆరూపకప్రభావము చెప్పడానికి వీలులేదు. 'ఉత్తర రామచరిత్రము' మరికొన్ని సంవత్సరాలకు గాని ప్రీతిపాత్రము కాలేకపోయింది. ఆరోజుల్లో 'మాలతీమాధవమ్' 'మహావీరచరితమ్' మనస్సుకు నచ్చినవి. 'మాలతీమాధవము' మొదటినుంచీ నేటివరకూ చాలా యిష్టము. 'మాలవికాగ్నిమిత్రమ్' ఒకమోస్తరు. అందులో రాజుకు ఇద్దరుముగ్గురు భార్యలుండడమే కొంతవరకు అభిమానం తగ్గడానికి కారణం అయిఉండవచ్చు. మరి 'విక్రమోర్వశీయము' మాత్రము హృదయంగమం అయింది. రాజు వియోగవిలాపాలు నామనస్సుకు ఎక్కిఉంటవి. 'రత్నావలీ' 'ప్రియదర్శికా' 'నాగానందాల'లో 'ప్రియదర్శిక' నచ్చకపోయింది. తక్కిననాటకాలలో 'వేణీసంహారం' 'ప్రబోధచంద్రోదయం' 'ముద్రారాక్షసం' చాలా మనోరంజకంగా ఉండేవి.

1903 సంవత్సరంలో 'వేణీసంహారనాటకం' తెనాలిలో తెలుగున ప్రదర్శించారు. అందులో హరిప్రసాద రావుగారు దుర్యోధనపాత్ర ధరించారు. ప్రభల ఆంజనేయులుగారు -అనుకొంటాను- అశ్వత్థామభూమిక ధరించారు. ఆనాటకం చూచి నప్పటినుంచీ దానిమీద అభిమానం కలిగింది. సంస్కృతమాతృక చదివినప్పుడు ఒళ్ళు గరిపొడిచింది. చిన్నవాళ్ళకు వేదాంతశాస్త్రం గాని, తత్త్వవిషయ ప్రతిపాదకమైన ఏగ్రంథముగాని రుచించదంటారు. అయితే అధ్యాత్మదృష్టి కలిగి, వేదాంతగ్రంథాలు చదువుతూఉండే మాబావమరిదివల్లనూ, కృష్ణమిశ్రుని నిర్మాణకౌశలము వల్లను 'ప్రబోధచంద్రోదయం' మహామనోహరంగా ఉండేది. తక్కిన నాటకాల్లో వచనభాగాలు నోటికి సరిగా రాకపోయినా ఇందులో వచనభాగాలు చాలా నోటికి వచ్చినవి. ముద్రారాక్షసంమీద ఇష్టం కలగడానికి కారణం వేరు. అందులో ప్రేమ విషయం లేకపోవడం, రాజనీతి ప్రధానంగా ఉండడం, చాణక్యుడే పాత్ర కావడం, సంస్కృతంలో మొదట చదివిన నాటకం అదే కావడం. ఈ టన్నింటివల్లా ఆనాటకంమీద ప్రత్యేకాభిమానం.

ఇన్ని రూపకాలు తరుచుగా చదువుతూ ఉన్నప్పటికీ, ప్రాకృతం అభ్యసించలేదు. సామాన్యంగా విద్వాంసులు ఛాయ చదివించి ఊరుకొంటారు. నేనూ అదే మార్గం అనుసరించాను. ప్రాకృతం నోటితోనైనా అనక, నిమ్నభాగంలో అచ్చువేసిన సంస్కృతపదాలే చదివి సంతృప్తి పడ్డాను. తర్వాత ఏడెనిమిది సంవత్సరాలకుగాని ప్రాకృతం నేర్చుకోలేదు.

మనస్సు ఈవిధంగా పనిచేస్తున్న రోజుల్లో ఎక్కువగా ఆంధ్రగ్రంథాలు చదవడానికి ఏమి అవకాశం ఉంటుంది? ఏదైనా కొత్తపుస్తకం తెనుగులో కనపడితే చదివి ఉంటాను. అవి ఏవీ సరిగా జ్ఞప్తిలో లేవు. చిల్లరిగె శ్రీనివాసరావుగారు తెనిగించిన 'కృష్ణకాంతుని మరణశాసనము', నారాయణమూర్తిగారి 'విమలాదేవి' ఆసంవత్సరాంతంలో చూచానేమో. ఎప్పుడైనా చూడనీ మరణశాసనం మట్టుకు నాలో కొంతమార్పు కలిగించింది. మొత్తంమీద ఆసంవత్సరం నేను తెనుగులో ఏదీ రచించలేను.

= క్రమశః =

*

# భవిష్యత్తు

ఊటుకూరు సత్యనారాయణ రావు

ఈయుషస్సులమసక
తెగసి కాంతుల రేపి
విశ్వమోహినిహృదయ
వీధి పులకింపగా
వెన్నెలలు వెలయించునో!
వలపులో
వేదనలు రగిలించునో!

విరికన్నెసిగ్గుతెర
మరుగు నూరుపుసెగల
సొగయు వాసనగాలి
సగమైనమాధవుడు
విధురభావము దాల్చునో!
ఒంటిగా
వెర్రియై వెంటాడునో!

ఆపాటనొక్క, ముని
మాపువెన్నెలకైపు
కలువకమ్మనిసుధల్
కరగి పాడినకథల
కీజీవితమె మరచునో!
స్వప్నలో-
కాల మధురిమె వలచునో!

అది సోకుమాత్రనే
మదిర త్రావిన మరపు
అది యెవరో——? చరమసం
ధ్యాశరత్తుల కలికి
జాబిల్లిరేక యేమో!
మనసునీ-
డల నమృతనర్తకియో!

# నిరీక్షణ

అడివి బాపిరాజు

నీకై నే ఎదురు చూస్తి
నీకై నే వెదకినాను
కనుమూతల కలలల్లో
మన సెరుగని తీపుల్లో
నీకై ...

తవ సైననిరీక్షణలో
తలపులతో బ్రో మైత్రిని
నాతోనే లోకాలు
నాతోనే క్షణికాలు
నీకై ...

ఒకపాటలో ఒదుగుల్లో
ఒకరాగం స్వరముల్లో
నా రాణీ, కిరణంలా
మెరిశావే ఎదుట ఎపుడు!
నీకై ...

గోదావరి ఆగిందీ
గోవత్సం ఆడిందీ
సాయంత్రం బంతిరంగు
చల్లెనె పన్నీటివాన
నీకై ...

*

# నీ కళ్ళు

అడివి బాపిరాజు

నా రాణి కన్నుల్ల నాట్య మొక్కటి మెరిసె
తారాపథాలలో తళుకు పూలే మెరిసె ...
శీతకాలపు కృష్ణలోతులో మూర్తించి
వరదకాలం కృష్ణవడులలో నర్తించి ... నారాణి ...
ఆకనులపాపల్లొ అదృశ్యహాసాలు
కనురెప్పమూతల్లొ కథచెప్పవేసాలు ... నారాణి ...
ఒకనాడు కోర్కెలో సకలమ్ము మరపించు
మబ్బుల్ల మరునాడు మాయమై ముకుళించు ... నారాణి ...
కనుగొనల వెలుగుతూ చినుకులే చేరినవి
పంకిలమ్మైన నా బ్రతుకునే కడిగినవి ... నారాణి ...

*

# సర్వజ్ఞస్వామి

నోరి నరసింహ శాస్త్రి

తప్పు లేదు నాదరి నని మరి మరి
తథ్యము పలికితి సఖుతో,
తప్పు కలదు నీదగ్గర నెంతయు
తథ్యం బనె నత డంతట.

నన్ను క్షమింపం దగు నట్లే నని
నాసఖు వేడితి స్వామీ,
కన్నీ రత్తరి నేకధారగా
కార్చితి దీనత స్వామీ!

కాయం బంతయు కంపం బొందగ
కాళ్ళు జారె నోస్వామీ,
ముఖమున చెమటలు ముంచివేయగా
మాసె శోభ యోస్వామీ!

ఏగతి పట్టెనొ ఈయార్తధ్వని
కిది యని చెప్పగ నేలా,
సర్వశక్తికే సాధ్యము కానిది
సాధ్యం బగునే నాకున్!

నీగభీరఘన నిర్ఘోషంబుల
కేగతి పట్టును గిరులన్
నీయాకాశము నిండుప్రతిధ్వని
నిన్నే నవ్వును గాదా!

అట్లే యయె నీయార్తునివాక్యం
బాప్తమిత్రుసన్నిధిలో
కఠినశిలాధిక కఠినతరులు గా
కళ్లు లేని యీనరులు!

తప్పు లేదు నాదగ్గర నని నీ
దగ్గర పలకను స్వామీ,
నరమాత్రులనే నమ్మి మరియుటను
నాత ప్పున్నది స్వామీ!

నన్ను క్షమింపుము నాథా యని నీ
సన్నిధి వేడను స్వామీ,
కన్నీ రొకచిను కన్న నిప్పుడే
కార్చుజాల నోస్వామీ!

ఏతీరున నన్నీక్షించెదవో
ఇప్పుడు చూచెద కాకన్!
సర్వజ్ఞత్వము సార్థకముగ నను
సంరక్షింపవె స్వామీ!

# మాక్లీదుర్గంలో కుక్క

## విశ్వనాథ సత్యనారాయణ

౧

మాక్లీదుర్గం రైలుస్టేషను గుంటకలునుంచి బెంగుళూరు పోయేత్రోవలో నాల్గు స్టేషనుల కివతల నున్నది. ప్లాటుఫారంకన్న రైలుస్టేషను పది గజాలు ఎక్కి వెళ్లాలి. రైలురోడ్డుప్రక్కనే పెద్దకొండ ఉన్నది. దానినిండా చెట్లూ చేమలూ, రాళ్ళూ రప్పలూ ఉన్నవి. అప్పుడప్పుడు వేగోలాలు సివంగులు రాత్రిళ్ళు స్టేషనులోకి వస్తూ ఉంటవి. స్టేషనుకి వెనుక పెద్దలోయ ఉన్నది. ఆలోయ అంతా సారవంతమైనప్రదేశం. లోయ కవతలతట్టు ఉన్నకొండమీద నెవరిదో భాగ్యవంతులది పెద్ద సౌధం ఉన్నది. ఈలోయలో రెండుమూడు వాగులు ఉన్నవి.

మాక్లీద:ర్గంస్టేషను చాలా చిన్నది. అందులో ఒకచిన్నఅంగడి ఉంది. రైళ్ళు వచ్చేవేళకూ పోయేవేళకూ ఆఅంగడి తెరచి ఉంటుంది. ఒకకుక్క అంగడితెరచినప్పుడల్లా అక్కడ తయారు. అంగడి ఎత్తుగా ఉంటుంది. కుక్క తనచూపు అంగడిలోని పళ్ళికలలో ఉన్నమిఠాయిమీద పడేఅంత సమరేఖలో నుంచుకొని ఊర్ధ్వదృష్టితో తపస్సు చేస్తుంది. ఎప్పుడైనా, వాడంగడి సర్దేటప్పుడైనా, యెవడైనా కొనుక్కునేటప్పుడైనా ఒకచిన్నముక్క జారిపడుతుం దేమో అని యెదురుచూస్తూ ఉంటుంది. వారానికో పదిరోజులకో అట్లా యెప్పుడూ పడసుగాని, పదిరోజుల క్రింద చేసినపకోడీ కొనుక్కొన్నవాడు చద్దివాసన వేసి పారేస్తే కుక్క దాన్ని తన నోటితో అగావుగా పట్టుకొని ముందుపళ్ళతో నొక్కి అంగట్లోకి పోయేందుకు రెండుగతుకులు గతికి మ్రింగి దగ్గు వచ్చి మళ్ళీ కక్కుతుంది. రైలు వెళ్ళిపోవటంతోటే అంగడివాడు మూస్తాడు. కుక్క పోయి సెలయేట్లో నీళ్లు తాగుతుంది. ముందుకాళ్ళు చాచి గడ్డిమీద పడుకొని, లేతగరికపాచలు కొరుకుతుంది. ఆకుక్క మంచి మిడతల వేటగాడు. అప్పుడప్పుడు పొలముపిచ్చుకలనుగూడా పట్టుకుంటుంది. సెలయేటినీళ్లూ, మంచిగాలీ, లోయలోకి దిగటం, ఎక్కటం- కుక్క మంచి దేహపటుత్వంలో ఉన్నది. కుక్క చెదరిమైనా స్టేషనెదురుగా ఉన్నకొండమీదికి పోదు.

ఒకసారి ఒకపెద్దమనిషి ఒక ఆడసీమకుక్కను స్టేషనులోకి తెచ్చాడు. వాటి రెంటికీ ప్రథమదర్శనంలోనే ప్రణయం ఏర్పడ్డది. ఆపెద్దమనిషిచేతిలో ఒక చేతికఱ్ఱ ఉంది. దాన్ని చూచి మనకుక్క తనప్రియురాలిదగ్గరకు వెళ్లింది కాదు. పుట్టింట

ఉన్న ఆడపిల్లవలె సీమకుక్క-మాత్రం నిర్భయంగా తనవలపుకాణ్ణి చూడటం మొద లెట్టింది. పెద్దమనుష్యులు తన్ను పోకిరీ అనుకుంటారేమో నని దుర్గపు కుక్క దానివంక చూచీ చూడకుండా చూడటం మొద లెట్టింది. పెద్దమనిషి తన కుక్కను కటకటాలకు కట్టివేసి సామానులుతూయించుకోటానికో దేనికో వెళ్ళాడు. రెండుకుక్క-లూ కలసికొన్నవి.

స్టేషనుమాస్టరు కొంచెము చదువుకొన్నవాడు. పెద్దమనిషికీ ఆయనకీ ఆధునిక సిద్ధాంత రాద్ధాంతాలచర్చ జరుగుతోంది.

స్టే. మా: కాదండీ! వర్ణవ్యవస్థ ఉండాలి. మనపూర్వులు దానిని నియమించారు. వాళ్ళు ఏప్రయోజనం కోసం దాని నేర్పరచారో ఆప్రయోజనాలు తెలియకుండా మనం వానిని తీసివేయరాదు

పె. మ: అట్లా అంటే లాభం లేదండీ. ఆసిద్ధాంతా లేమిటో చెప్పండి. మనవాళ్ళు ఏర్పరచారు కదా అని గుడ్డి ఎద్దు చేలో పడ్డట్లు పోరాదు. మనవాళ్ళు చెప్పారు కదా అని వినేరోజులు పోయినై. ప్రతిదీ వాదానికి నిలవాలి. వాదానికి నిలవంది మేము ఒప్పుకోము.

స్టే. మా: వారు ఏప్రయోజనా లర్థించారో మనకు తెలియదు. మనకు వాటిని తెలుసుకునేటంత మేధాశక్తి లేదు.

పె. మ: దానికి నే నొప్పుకోను. జ్ఞానము ప్రపంచం నడచినకొద్దీ వృద్ధిఅవుతోంది గాని తగ్గడం లేదు. మనపూర్వులకు మన కున్నంతవాదనాశక్తి లే దంటాను. మానసికశాస్త్రం, పదార్థవిజ్ఞానశాస్త్రం ఇప్పుడు వృద్ధి అయినంత పూర్వం వృద్ధి కాలేదు.

స్టే. మా: అయితే మీరు వర్ణవ్యవస్థ తీసిపారవెయ్యాలి అంటారా?

పె. మ: తీసివెయ్యా లంటాను. ఈవ్యవస్థమూలంగా అనేకభేదా లేర్పడుతున్నవి. కొంద రనవసరంగా తాము గొప్పవాళ్ళ మనుకొంటున్నారు. తక్కు-వ కులాలమీద అధికారం చలాయిస్తున్నారు. వర్ణాంతరభోజనములూ వివాహములూ జరుగవలె. అప్పుడే దేశానికి ముక్తి.

స్టే. మా: సర్వభూతములయందు సమత్వం ఉండాలిసిందే కాని వర్ణాంతర వివాహం నేను ఒప్పుకోను. పైకి కనపడేభేదాలు మనసా లేకుండా చేసుకోవాలి. మనపూర్వులు కూడా అదే చెప్పారని నా ఉద్దేశం.

పె. మ: మనవా ళ్ళట్లాగూ చెప్పలేదు. మనవాళ్ళు సంఘానికి చేసినద్రోహం ఇంతంత కాదు.

పెద్దమనిషి బయటికి వచ్చాడు. తన కుక్క వంక చూచాడు. రెండు కుక్కలూ తమవర్ణభేదం మరచిపోయి కలసికొంటున్నవి. పెద్దమనిషి పరుగెత్తుకొనిపోయి దుర్గపుకుక్కను పదిపదకొండుదెబ్బలు కొట్టినాడు. 'జ్ఞాతాస్వాద' మైనఆకుక్క వదలిపెట్టుటకు సమర్థము కాక చివరకు వదలించుకొని పోయింది. స్టేషను బయటకు పోవువరకు కుక్కకు తెలిసింది, తన ఒకతొంటి విరిగినదని. ఆపెద్దమనిషి తనకుక్కనుకూడా నాలుగు మోదినాడు.

స్టేషనుమాస్టరీగందరగోళం విని బయటకు వచ్చాడు సంగతంతా తెలిసికొన్నాడు. 'అయ్యా! ఎందుకు కుక్కనట్లా కొట్టారు?'

పె. మ: ఇది జాతి గలకుక్క. దీనికి తోడు మగకుక్కను కొనవలెనని చాలా ప్రయత్నం చేశాను. దొరకలేదండీ. దీనికి ఋతువు వచ్చింది. దీన్ని బెంగళూరు తీసుకు పోతున్నాను. ఈజాతి మగకుక్కతో కలపవలెనని.

స్టేషనుమాస్టరు కొంచెము నవ్వాడు. పెద్దమనిషి కనుబొమలమీద మాత్రం కొంచెం నల్లనిరేఖ యేర్పడ్డది. అయినా నవ్వాడు.

తరువాత మళ్ళీ యిద్దరూ స్నేహంగా మాట్లాడుకొన్నారు. స్టేషనుమాస్టరు సీమకుక్క అందానికీ, మొగాన మచ్చకూ, తోకకుచ్చుకూ, దాని గోధుమవన్నె రంగునకూ మిక్కిలి మెచ్చుకొని దాన్ని ముద్దాడాడు. దీనికి పిల్లలు పుడితే నాకోపిల్లను తప్పకుండా ఇవ్వాలని వాగ్దానం చేయించుకొన్నాడు.

ఊరకుక్కసంసర్గంచేత సీమకుక్క ఒళ్ళంతా మన్నయింది. అంతకుముందే వాన కురిసి పక్కనున్న పెద్దబండలమీద నీటిపడెలు కట్టినై. పెద్దమనిషి తన తోలుపెట్టె తెరచి రెండుతికినతువాళ్ళూ సబ్బుబిళ్ళా తీసి ఆపడెలో కుక్కను అభ్యంగము చేయించి తువాళ్ళతో దాన్ని చక్కగా తుడిచాడు. ఇంతలో రైలు వచ్చింది. ఆయన కంయి కంయి మని అరచుచున్న కుక్కను తువాళ్ళలో చుట్టి చంకను పెట్టుకొని రైల్లో ఎక్కాడు. మగకుక్క ఆడకుక్కకు దూరంగా నిలుచుండి కుంటుతూ కుంటుతూ దానివంకనే సాకూతంగా చూడడం మొదలుపెట్టింది. ఆయన కిటికీలోనుంచి తొంగిచూచి కుక్కవైపునకు రెండుసార్లు కర్రఆడించాడు. అది మరీ దూరంపోయింది.

రైలు సాగింది. సీమకుక్క కంయి కంయి మని తలుపుదగ్గరకు పోతుంది. తొంగి చూస్తుంది. అతడు గొలుసుతో లాగి పట్టుకుంటాడు. రైలు బెంగళూరు పోయినతరువాత కుక్క ఏడుపు మానేసి యజమానిదగ్గర చనువుగా కూర్చుంది.

అతడు దానిని ఒళ్లోకి తీసికొని 'లీలా! అల్లా చెయ్య వచ్చునా?' అని దానినోట్లో నోరు పెట్టి ముద్దు పెట్టుకొన్నాడు. ఇందాకటి కుక్క యీపనే చేస్తే అంతహృదయంగమంగా ఊహకున్న ఆకుక్క పరపురుషచుంబనం పరిహరించినట్లుగా అతని చుంబనం పరిహరించింది.

౨

దుర్గములోకుక్క తనతోంటి గాడిదగడపాకునకు, అడ్డసరపాకులకూ వేసి రుద్దుకొని సెలయేటిబడ్డున నున్న ఒండుమట్టిలో అద్దుకొని పదిహేనురోజులకు కాలు సరిచేసికొంది. మళ్ళీ స్టేషనులోకి వస్తూన్నది. మిఠాయిదుకాణంవంక చూస్తున్నది.

ఒకనాడు ఇద్దరు విద్యార్థులు అక్కడికి వచ్చి దుకాణంలో యేదో కొనుక్కొని తింటూ బల్లమీద కూర్చున్నారు. వాళ్ళ యిద్దరిమాటలూ కుక్కచెవిని పడ్డవి.

ఒకడు : మనదేశంలో భూతదయ అన్నది లేదు. పెద్దవాళ్ళందరూ పిన్నవాళ్ళమీద అధికారం చేస్తారు. నేను బి. ఏ. ప్యాసైనాను. ఉద్యోగ మిచ్చే దిక్కు లేదు. పేదవాళ్ళు మలమల మాడిపోతున్నారు. గొప్పవాళ్ళు సోఫాలమీద గాని ఒరగరు.

రెం : మనవాళ్ళు అందరూ స్వార్థపరులే. పిడికెడు బిచ్చం పెట్టరు. చివరకు కుక్కకు వేసిన ట్లన్నా పేదవాళ్ళ కింత వెయ్యరు.

కుక్క వాళ్ళదగ్గరకు వచ్చి వాళ్ళచేతిలో పొట్లంవంక చూసింది. వాళ్లిద్దరూ ఇంగ్లీషులో మాట్లాడుకొంటున్నారు. అందులో ఒకతనికాళ్ళకు బూట్లు ఉన్నవి. కాలిమీద కాలువేసుకు కూర్చున్నాడు. ఆబూటుకాలితో కుక్కను డొక్కలో తన్నాడు. దానికి రెండుమూడురోజులనుంచీ తిండి లేదు. ఆదెబ్బ పొట్టలో యేనరానికి తగిలిందో అది మెలికలు తిరిగిపోయింది. కొంతసేపటి కది తెప్పిరిలి లేచి పోతోంది. రెండవవిద్యార్థి తనచేతిలోది కొంచెం దానిముందర వేశాడు. అది నొప్పిచేత దానిని ముట్టుకోకుండా పోయింది.

ఆరోజుసాయంత్రం కొండమీదనుంచి ఒకవేగోలం దిగి రాత్రిపూట స్టేషనులోకి వచ్చింది. కుక్క భయపడి దుకాణంక్రింద ఒక గూడుగా ఉంటే దానిలో

దాక్కుంది. అర్ధరాత్రివేళ స్టేషనంతా నిర్జనంగా ఉంది. వేగోలం పసిపట్టి ఆగూటి దగ్గర కాపలా వేసింది. వేగోలం మూతి గూట్లోకి పెడితే కుక్క లోపల దాక్కొని దాని నోరంతా కరచింది. వెనక్కు తిరిగితే తోకా, పృష్ఠభాగం గాట్లు చేసింది. వేగోలం మైమరచి ఉంటే కొంచెం బయటకి వచ్చి దాని మెడ పట్టుకొని గుంజింది. అది కరవవస్తే తను గూట్లో దాక్కుంటుంది. ఇట్లా మూడు నాలుగు గంటలు దాగుడుమూతలయుద్ధం చేసి ఒక ఒడుపులో వేగోలంపీక పట్టుకొని దానిఊపిరి ఆగే దాకా కుక్క వదలలేదు.

తెల్లవారినతరువాత అందరూ వచ్చారు. కుక్క పౌరుషం చూశారు. ఏడాది రెండేండ్లుగా మర్యాద లేనిఆకుక్కకు ఆనాటితో మర్యాద యెక్కువైంది స్టేషను మాస్టరు దానికి రోజూ అన్నం వెయ్యమని ఫర్మానా యిచ్చాడు. ఆరోజు సాయంకాలం అంగడివాడికి మహోదయ కలిగింది. ఒక్కబూందీపూస బీరువోనియ్యని ఆ పిసినిగొట్టు సంవత్సరముబట్టీ పరిశిష్టపునూనెతో పరిశిష్టంగా వస్తున్నమితాయి జాంగిలీ దానిముందర పెట్టాడు. ఆమితాయి మ రెవ్వరూ కొనరు. ఎవ్వరూ కొనక పోవడంచేత వారంరోజుల కొకసారి తాజాగా నూనెలో వేస్తున్నా ఎవ్వరూ కొన లేదు. కుక్కమీద మహోదయపుట్టి ఆ జాంగిలీ దానిముందర పెట్టాడు. అది తిన్నది. ఆప్యాయంగా తిన్నది. ఆమరునాడురాత్రి కుక్క తెల్లవార్లూ మహాబాధ పడు తున్నట్లుగా ఏడవటం మొదలుపెట్టింది. ఇంట్లో పడుకొన్న స్టేషనుమాస్టరూ పోర్టర్లూ వేగోలాలు వచ్చినై అనుకొన్నారు. కుక్క పగలు పోయి పొలాలమీద అడవులమీదా తిరిగి వస్తుంది. దాని కేదో మహావాతం పుట్టింది. కనపడ్డ ఆకల్లా కొరికింది. ఏఆకూ పని చెయ్యలేదు. ఒండుమట్టి నాచేత కాదంది. సెలయేటి నీళ్ళు ఇవి మాపని కాదన్నవి. రాత్రిళ్ళు స్టేషనులో పడి యేడుస్తుంది. మెలికలు తిరిగిపోతుంది. తన నడుము రైలుకిింద పడ్డట్టు గోల కెత్తుతుంది. వారమురోజు లీరీతిగా కొట్టుకులాడి దానివ్యాధి ఉపశమించింది. రెండురోజు లుపవాసం ఉండి కూడా వేగోలాన్ని చంపిన యీకుక్క యీవారమురోజు లయ్యేటప్పటికి చిక్కి శల్యమయింది. దాని వెనుకకాళ్ళూ మొత్తా తప్పబడిపోయినవి. అది యెక్కడో ఒకచోట పడుకొని మూలగడానికి కూడా ఓపిక లేకుండా సన్నగా యేడుస్తుంది. దానికి మితాయిఅంగడి అంటే భయం వేసింది. అంగడివైపుకు పోదు. అంగడివంక చూడదు. మునుపు స్టేషనులో యధేచ్ఛంగా తిరిగేది. స్టేషనుమాస్టరుగదిలోకి పోయి తొంగి చూస్తే చీడకుక్క, పేలకుక్క అని దాన్ని కొట్టడం మొదలు పెట్టారు.

## ౩

ఆరునెల లైంది. ఆకుక్క చావదు, బతకదు. ఒకరోజున సీమకుక్కను తెచ్చిన పెద్దమనిషి వచ్చాడు. మాస్టరూ ఆయనా పూర్వపు పరిచయాన్ని మగిడించుకొని మాట్లాడుకొన్నారు. మాస్టరు 'ఏమండీ, కుక్క పిల్లలను పెట్టిందా?' అని అడిగాడు. పెద్దమనిషి ఇట్లా అన్నాడు: 'అయ్యా! కుక్కను బెంగుళూరు తీసుకెళ్ళాను. జాతి కుక్క నెక్క నివ్వలేదు. మీపాడుకుక్క పని చేసింది. కుక్క పిల్లల్ని కన్నది. రెండుపిల్లలను పెట్టింది. ఊరకుక్కల్ని పెట్టింది. నాకు చాలా విచారం వేసింది. ఈసారి మంచిపిల్లలు పెడితే మీకు తీసుకువచ్చి యిస్తా'నన్నాడు. స్టేషనుమాస్టరు 'మాకుక్క చాలా మంచిదండీ! అది మంచిపౌరుషశాలి. కొన్నాళ్ళకిందట అది ఒకవేగోలాన్ని చంపిం'దన్నాడు. పెద్దమనిషి 'పోనిద్దురూ! వెధవకుక్క. నాకు దానిని చంపవలె నని ఉంది. ఇంకా అది మీస్టేషనులో ఉంటే చూపించండి. దాన్ని నరికిపోతా' నన్నాడు. స్టేషనుమాస్టరు 'దానికేదో పెద్దవాతం పుట్టి కుక్క పాడైపోయిం' దన్నాడు.

ఇంతలో ఆకుక్క యీడ్చుకుంటూ అక్కడికి వచ్చింది. స్టేషనుమాస్టరు ఇదేనండీ అని చూపించాడు. పెద్దమనిషి కోపం పట్టలేక తనచేతిలోని పేముబెత్తంతో ఒకటి వేశాడు. అది పారిపోలేక అక్కడే ఒకపక్కకొత్తగిలి మెడా కాళ్లూ యెత్తి యేడ్చింది. పోర్టరు వచ్చి కాలితో దాన్ని అవతలికి తోశాడు. మాస్టరుగారు నవ్వి 'మీ కెంతకోప మండీ' అన్నాడు.

వారి యిద్దరిస్నేహమూ బలిసి ఆరాత్రి పెద్దమనిషి స్టేషనుమాస్టరుగారికి అతిథిగా ఉండిపోయినాడు. ఆనాటిరాత్రి ఆకుక్క రైలుకింద పడ్డది. రైలు దాని నడుముమీదనుంచి పోయింది. "అంగవ్రాతములోన చికిత్సకుడు దుష్టాంగమ్ము ఖండించి" నట్లు రైలు వ్యాధిగ్రస్తమై నష్టశక్తి యైనదాని పశ్చార్ధమును ఖండించింది. కాని శేషాంగశ్రేణికి రక్ష లేక అది ఒకఅరగంట తన్నుకొని చనిపోయింది.

## ౪

తరువాత నాల్గునెలలకు ఆపెద్దమనిషి తన రెండుకుక్కపిల్లలలో ఒకటి చచ్చిపోయిన దని చెప్పి రెండవదానిని స్టేషనుమాస్టరుగారి కిచ్చాడు. అది ఆరు

నెలల్లో యెదిగి మరల తనతండ్రివలె నైనది. దానికి భయము లేదు. ఎదురుగా నున్న కొండమీదికి సికారు పోయి వస్తుంది. ఎవ రన్నా దానికి మిఠాయి పెట్టబోతారు అది వాళ్లకు పళ్లు చూపించి కరవవస్తుంది. ఎన్ని ఆడకుక్కలు వచ్చినా వాటివంకకు చూడదు. అది పిల్లవేగోలాలనూ కుందేళ్లనూ నక్కలనూ వేటాడుతుంది. విద్యార్థులు వచ్చి భూతదయోపన్యాసములు చేస్తూంటే వాళ్ళవంక ఓరగా తిరస్కారముగా చూస్తుంది. ఆ పెద్దమనిషి వచ్చి వర్ణవ్యవస్థను గూర్చి స్టేషనుమాస్టరుతో మాట్లాడుతో ఉంటాడు. ఈకుక్క వస్తే దానిని ముద్దుగా ముట్టుకోబోతాడు. అది కోపంగా పళ్లు చూపించి జీర్ణము కాని వేగోలపుమాంసం కక్కిపోతుంది. రైలు మైలుదూర మున్నదనగా ముక్కోళ్ళతో శ్వాస మెగలాగి పసిపట్టి సీదరించుకొని తొలగి పోతుంది.

మిఠాయిదుకాణమువా డొకనాడు చద్దిమిఠాయి దానిముందర వేయబోయినాడు. అది వాడి పిక్కకండలు పట్టి లాగింది. అది వేగోలం గాని కుక్క కా దన్నార దరూ. దానికి మనుష్యుల్ని చూస్తే వెగటువేసింది కాబోలు, కొన్నాళ్ళకి జనసమ్మర్ద మైన ఆస్థలాన్ని వదలిపెట్టి అడవుల్లోనే ఉంటూ వచ్చింది. అప్పుడప్పుడు స్టేషనుదగ్గరకు వస్తుంది. నిత్యాగహానసాహారం వల్లనో, తల్లిపోలికో తోకకుచ్చు బలిసింది. కోరలు వచ్చినై. మనుష్యునిగాలి తగిలితే బృహస్పతి తమ్ముడు సంవర్త మహర్షివలె సీదరించుకొని తొలగిపోతుంది.

*

# జైలులో

కొడాలి ఆంజనేయులు

భావమున పొంగి పొరలు చింతావియోగ
సాగరతరంగఘోషల జాలివడని
కొండరాతి గోడలమధ్య కూరుచుండి
కడపుచుంటిని కటికిచీకటుల నిశల.

ప్రణయమధురమ్ము లగు ప్రియురాలికనుల
కొలకులను వేడినీ రెప్పు డొలుక గంటి
నకట ! చల్లనిచందమామకును నాకు
నాటనుండి ఋణానుబంధమ్ము దీరె.

ఏవియో స్వప్నగత పూర్వవృత్తములను
తలచుకొని కొన్ని అర్ధరాత్రముల లేచి
కనులు పొడుచుకొన్నను గాని కానరాని
కారుచీకట్ల కన్నీట కడిగినైతు.

నాకు నడిరేయి మింటికి నడుమ నపుడు
కటికి రాల కప్పొక టడ్డు కాదయేని
జాలిగుండెలు గలుగునక్షత్రగణము
లెంత దుఃఖించి యుండునో యెవరి కెరుక !

తను కెరుంగని ప్రియురాలి కనులలోన
కృష్ణపక్ష నిశీథము లెన్నియేని
కలసిపోవుచు నున్నట్లు కలల గాంచి
ఉలికిపడి లేతు రాత్రివేళల నొకప్డు.

మేము బంధింపబడుగాక, దాన నేమి
కాలిసంకెల లటునిటు కదలకుండ
కడపితి ప్రియావియోగ దీర్ఘమ్ములైన
అర్ధరాత్రుల స్వప్నప్రయాణములను.

# జైలులో

తనువు కదలక యున్నను మన సదేమొ
పూర్వపరిచిత పుణ్యభూములను చూడ
నదుల వాగుల వనుల కొండలను దాటి
మెరుపు మెరసినవిధమున పరుగువెట్టు.

పగటివేళల నా క్షేమవార్త యొకటి
పంపగ దలంచి యొకపిచ్చివాని వగిది
కాళిదాసుని దివ్యమేఘమ్ముకొరకు
కలయ వెదకుచునుందు నాకసము నెల్ల.

రెండుసంవత్సరము లొంటరిగ ప్రవాసి
నగుచు నెన్నియో ఆకాశహర్మ్యములను
కట్టుకొంటిని నా చిన్నికొట్టులోన
నేకిరీటాధిపతు లవి యెక్కగలరు ?

జీవితపుదండలో రెండుపూవులు సుడి
గాలితాకున రేకులు రాలి పోయి
నట్టు లయ్యెను కారాగృహాన నేను
కడపినట్టి రెండువసంత కాలములును.

భీకరవిషాద వీచికల్ వెల్లివిరియు
నీగభీరకాలసముద్ర మింక నెన్న
డే నమూల్యరత్నముల పండించు ననుచు
కాచుకొనియుంటి దైవయోగమ్ముకొరకు.

*

# కృష్ణవేణి

## నోరి నరసింహ శాస్త్రి

ఈయాషాఢ నవాంబుదార్భటులతో నేఁ శ్రుతిం గల్పి త
ల్లీ, యీకీర్తిగ నిత్యయౌవనసుధాశ్రీరాగ మాలావళుల్
చేయఁ జాలితి వెన్నిమారు లిటులన్ జీర్ణించు నాబోంట్లకున్
పాయం బింత చిగుర్చ నేర్తివె అంబా, కృష్ణవేణీనదీ !

నిన్నామొన్నటిదాక నొంపబడి ఎంతే జాలిగా జాలుగా
నున్నా వోపిక లేక నాకువలెనే, ఒక్కుమ్మడిన్ నేఁడు సం
పన్నాత్మీయ మహాప్రవాహమున నివ్వా లాడుచున్నావు, నే
నిన్నీనాఁడును పోలి పొంగఁగలనంటే తల్లి, కృష్ణాపగా !

నీకూలంకష వాఃప్రపూరమున నెన్నే బిందువుల్ గల్గెనో
నీ కిన్నేళ్లవయస్సు లేవటవె, వీనిం జూడు షట్త్రింశకున్;
వాకల్ కట్టుచు సాగిపొంగి మరలన్ వర్షంబు వర్షంబునన్
నీకౌమారము చాటుచే, ఇఁకనో క్షీణించెం గదే యప్పుడే !

నీకల్లోల కరాబ్జసంతతుల మేనిం దాఁకవే చల్లగా,
నాకాయంబును ముంచి తేల్పవె త్వదంభశ్శీకరాసార ధా
రాకేళిన్, తనియింపవే శ్రవణముల్ గాంధర్వసంపత్తిచే,
నాకౌమార మిగుర్చి నిల్పఁగదె కృష్ణామాత, జన్మాంతమున్ !

*

# భాషా ప్రయోగ విధానము

తెలికిచర్ల వెంకటరత్నం

భాష- అది వ్యవహారములో ఉండే దేశములో ఇంచుమించు ఒకేవిధముగా ప్రజల వాడుకలో ఉన్నా జనుల కందరికీ ఒకేవిధముగా ఉపయోగపడదు. నిరక్షరాస్యులకు భాషయెడల ఉండే అభిప్రాయము (Attitude) వేరు, పండితులకు ఉండే అభిప్రాయము వేరు. భాష సాధారణవాగ్వ్యవహారములో ఒకవిధముగానూ, వచన రచనలో దానికి కొంచెము భిన్నముగానూ, పద్యకావ్యములలో ఇంకా భిన్నముగానూ ఉంటుంది. పదసామగ్రి మొత్తమువిూద ఒకటే అయినా దానిని ప్రయోగించేపద్ధతిలో ఉండే వైవిధ్యముబట్టిన్నీ, వివిధవృత్తు లవలంబించేవారికీ, వేరువేరు తరగతులవారికీ భాషవల్ల కలిగే ప్రయోజనములో ఉండే భేదములను బట్టిన్నీ అది నానారూపముగా ఉంటుంది.

వాఙ్మయమూ, లిపీ, ఉన్నభాషలనీ (Cultivated Languages), అవి లేని భాషలనీ (Uncultivated Languages) భాషలను రెండుతెగలుగా విభజించవచ్చును. వాఙ్మయము లేనిభాష ఆభాష వ్యవహరించేప్రజల కందరికీ ఒకేవిధముగా ఉపయోగపడుతుంది. అది నిత్యకృత్యములలో వారిమనోభావములు వ్యక్తీకరించే సాధనమాత్రమే కాని దానికి వేరేప్రయోజనము ఉండదు. వారిలో పాటలూ పదాలూ అల్లేవా రెవరయినా ఉంటే వారు తమనిత్యవ్యవహారములో ఉండే భాషలోనే అవి అల్లి హాయిగా పాడుకొని తోడివారితో కూడి ఆనందిస్తారు. వారిభాష నిత్యనూతనము. అందులో పాతవడ్డమాటలు ఉండవు. అపరిచితపదములూ వ్యవహారభ్రష్టము లయినరూపములూ ఉండనే ఉండవు. భాష ఉపయోగపడుటలో వైవిధ్యము లేదు గనుక భాషయెడల జనుల అభిప్రాయము ఏకముఖముగా ఉంటుంది- భాష అంటే నాటిప్రజలవ్యవహారములో ఉన్న వాగ్రూపమయిన సాధనమే.

వాఙ్మయము గలభాష పలువిధము లగుసంచనములతోనూ వ్యాపారములతోనూ కూడుకొన్న నేటినాగరక దేశములలో వివిధవృత్తు లవలంబించేవారికీ వేరువేరు తెగలవారికీ భిన్నభిన్నరీతుల ఉపయోగపడుతుంది. ఆ ఉపయోగపడే రీతినిబట్టి ప్రజలకు భాషయెడల ఉండేభావములో భిన్నత్వము ఏర్పడుతుంది.

---

నవ్యసాహిత్య పరిషత్తు నాలుగోసమావేశములో చేసిన ఉపన్యాససారాంశము.

ఈవిషయము స్పష్టపరిచేటందుకు మనమాతృభాష అయినతెలుగు ఏయేవిధములుగా ప్రవృత్తిలో ఉన్నదో పరిశీలించుదాము. మనభాష వ్యవహరించే జనులలో నూటికి ఇంచుమించు తొంభైమంది అనక్షరాస్యులు- కర్షకులూ, కూలినాలి చేసి జీవించేవారున్ను.తమసంఘములో తమవృత్తి నవలంబించేజనులతో శైశవావస్థ నుండిన్ని ఉన్నసాహచర్యమువల్ల అలవర్చుకొన్నభాష వారు మాట్లాడుతారు. వారు సామాన్యముగా నిర్వహించుకొనే పనులనుగూర్చి ఒకరితో ఒకరు మాట్లాడుకొనుటకూ, కష్టసుఖములూ మనోభావములూ వ్యక్తముచేసుకొనుటకూ, వారిదైనిక జీవనములో సర్వవిధములా ఉపయోగపడుటకూ, సమర్థమైనసాధనముగా ఉంటుంది వారిభాష. అంతకంటె నిలకడ గలప్రయోజనము వారిభాషవల్ల వారికి లేదు. భాషాచరిత్రముతోగాని భాషాశాస్త్రముతోగాని వారికి పని లేదు. తా మీభాష ఈవిధముగా ఉపయోగింప గలిగిఉండడానికి కారణ మే మని కాని, ఆయామాటల కాయాఅర్థములు ఎట్లు వచ్చిన వని కాని- ఈవిధములయినప్రశ్నలే వారిమనస్సుకు ఎప్పుడూ తట్టిఉండవు తమతమవృత్తుల కుపయోగపడే పరికరములను చిన్నతనము నుంచీ చూస్తూ, పెద్దలు వాటి నేప్రకారము వాడుక చేస్తూఉన్నారో కనిపెట్టుతూ, కాలక్రమంగా వృద్ధాచారాన్ని అనుసరించి ఎట్లుపయోగిస్తున్నారో, అదేవిధముగా చుట్టుప్రక్కల ఉండేజనులవ్యవహారము ననుసరించి సంఘములో ఉన్న భాష నేర్చుకొని వాడుకొంటున్నారు- అట్లు నేర్చుకొనడములో తమప్రయత్నము ఉన్నట్లు గుర్తించకుండానే అది అలవర్చుకొంటున్నారు. ఏవిధముగా ఆయాపనిముట్లు- వాటినిర్మాణపద్ధతీ, వాటి పూర్వపూర్వరూపముల చరిత్రమూ మొదలయిన విషయములనుగురించి తెలుసుకోకుండా- అలవాటుచొప్పున యుక్తరీతిని ఉపయోగించుకొంటున్నారో, భాషనుకూడా, దానితత్త్వపరిజ్ఞానము సంపాదించవలెనని ఆశించకుండా ఒకఉపకరణమువలె ఉపయోగించుకొంటున్నారు. అక్షరాస్యులు కారుగనుక వారికి భాష ఏకమాత్రప్రయోజనము కలది అయి ఉంటుంది ; వాఙ్మయము లేనిభాషలు వ్యవహరించేవారు తమభాషయెడల ఎట్టిఅభిప్రాయము కలిగి ఉంటారో అట్టిఅభిప్రాయమే వీరికిన్ని తమభాషయెడల ఉంటుంది. అప్పుడప్పుడు గ్రంథస్థ మయినభాష వారిచెవి సోకినా, అందులో తమ కర్థమయినంతవరకు బోధపరుచుకొని ఊరుకుంటారే కాని తమ కపరిచితమయినదానిని నేర్చుకొనుటకు కృషి చేయరు. కనుక వాఙ్మయము, లిపి కలభాషలవిషయములోకూడా కేవల వాగ్వ్యవహారముకోసమే భాష ప్రయోగించేవారికి ఇతరవిధములకూడా దానిని ఉపయోగించేవారికి పొడకట్టే భాషాసంబంధము లయినకొన్నికొన్ని సమస్యలు పొడకట్టవు.

వర్తకవ్యాపారములు చేసేవారికి పత్రములు వ్రాయడము, లెక్కలు వేసుకొనడము, వ్యాపారవిషయములనుగురించి జ్ఞాపకార్థముగా వ్రాసిపెట్టుకొనడము మొదలయినపనులు ఆవశ్యకము లవుతవి. కనుక భాష వారికి సామాన్యవాగ్వ్యవహారమునకు మాత్రమేకాక వ్రాతలోకూడా ఉపయోగపడుతున్నది. అందువల్ల వారు లిపి-మాటలను లిఖితముగా ఉంచడానికి వాడుకొనేసంకేతములు - నేర్చుకొంటారు. లిపి ఎంతసమగ్రముగా ఉన్నా నోట ఉచ్చరించేధ్వనుల నన్నిటినీ యథాస్థితముగా నిరూపించలేదు గనుక వ్రాతలో భాష స్వల్పభేదములు పొందుతుంది. ఆమాత్రము భేదముతప్ప వ్యాపారస్థుల వాగ్వ్యవహారములోనిభాషకూ, లిఖితరూప మయిన భాషకూ వేరేవ్యత్యాసము ఉండదు. భాష చెప్పినట్టు వింటూ వారిలోంగుబాటులో ఉంటుంది కాని వ్యాపారానికి అడ్డురాదు. నిలుచున్నపాళంగా, కబుర్లు చెప్పినట్టుగానే, గుమాస్తాకు ఉత్తరాలు dictate చేస్తాడు; పదములకోసము తడవుకోకుండా నిమిషాలమీద పత్రాలు వ్రాస్తాడు; వ్యాపారసంబంధ మైనకాకితాలు తొందరగా తిప్పివేస్తూ విషయము అవలీలగా అవగాహన చేసుకొంటాడు.

ప్రభుత్వోద్యోగస్థులూ ప్లీడర్లూ మొదలయినవారు విద్యావంతులై వాఙ్మయమామూలాగ్రముగా పఠించి గ్రాంథికభాష వ్రాయడము అలవర్చుకొన్నవారే అయినా తాము రచించే కచేరీకాగితములలోనూ పత్రములలోనూ వ్యవహారవిదూరము కానిలౌకికభాష వ్రాస్తారే కాని తమభాషాపాండిత్యమూ ప్రాచీనభాషాజ్ఞానమూ ప్రకటించుకొనడానికి గ్రాంథికభాష వ్రాయరు వారిదృష్టిలో భాష ఒకఉపకరణము, సాధనము. అంతేకాని అవోకపురుషార్థము కాదు; భాషద్వారా తెలియజేసేభావానికే ప్రాధాన్యముకాని భాషకు కాదు. ప్రజాసముదాయానికి సంబంధించిన విషయములతో వారికి పని కనుక ప్రజలవ్యవహారములో ఉన్నభాషే వారికి అవసరము. అది జనులు యావన్మందికీ సుబోధముగా ఉండకపోతే వ్యవహారహాని కలుగుతుంది.

సారస్వతనిర్మాణదృష్టితో భాషాప్రయోగము చేసేవారిలో వార్తాపత్రికా విలేఖరులు మొదలు మహాకవులవరకూ, అనేకము లగుఅంతరువు లున్నవి. వార్తలూ వింతలూ విశేషములూ జరిగినవి జరిగినట్టుగా, కల్పన లేమాత్రమూ చేయకుండా, పత్రికలకు వ్రాసిపంపవలసినవిలేఖరి వ్యవహారస్థ మైనభాషే ప్రయోగించినా అతని రచన విస్పష్టముగా, క్లుప్తముగా ఆకర్షకముగా ఉండవలెను కనుక రచనానైపుణ్యము కొంతవరకు చూపవలసినవా డవుతున్నాడు. కథలూ, హాస్యప్రధానము లయినరచనలూ వ్రాసేవారు వినోదార్థమూ కాలక్షేపముకొరకూ పత్రికలు చదివేవారికి ఆహ్లాదము కలిగించుటకై అనునిత్యమూ ప్రజలనోట తాండవమాడే జాతీయ

మగుభాష ప్రయోగిస్తారు. కథ కల్పితమయినది కాక వాస్తవముగా జరిగినదే అనేటట్లుండడానికిన్ని, వార్త దృష్టిపథమున పడగానే ఖుషీస్ఫూర్తి కలిగి హాస్యరసము ఒలికేటట్లు చేయడానికిన్ని మారుమూలపదములూ, ప్రాచీనవాఙ్మయముతో పరిచయ ముంటేనేకాని బోధ పడనికఠినసమాసాలూ, కల్పనలూ పరిత్యజించి, చదువరులకు భాషాసంబంధ మైనఆయాస మణుమాత్రమూ కలిగించని రీతిని వ్రాస్తారు. కథకుడు ఉపయోగించేపదజాలము సర్వసామాన్య మైనదే అయినా వానిరచనానైపుణ్యమువల్ల ఆభాష నూతనశోభతో గోచరిస్తుంది. సామాన్యశిల ఏరీతిగా శిల్పి చేతిలో సచేతనప్రతిమవలె పరిణామమును పొందుతుం దో సామాన్యభాష రచనాకౌశలము గలలేఖకుని చేతిలో అసాధారణముగా ఎంత ఆనందము ఉద్భవింప జేసేశక్తికలదై ఉంటుంది.

దినపత్రికలో నాటిప్రధానవిషయములను గురించిన్నీ నిత్యసమస్యల గురించిన్నీ ప్రమాణభూత మయిన అభిప్రాయము సంపాదకీయవ్యాసము లలో వ్రాయవలసిన పత్రికాసంపాదకుడున్నూ, రాజకీయరంగములో ఒకపక్షమునకు నాయకుడుగా ఉండి ఒక్కొక్కరోజు పలుచోట్లలో అనేకసభలలో తనపక్షము అవలంబించే కార్యక్రమమునుగూర్చి ఉపన్యసిస్తూ వివిధపత్రికలకు ఆవిషయముగురించి వ్యాసములు వ్రాసి పంపవలసిన రాజ్యతంత్రజ్ఞుడున్నూ, చిరకాలపరిశోధనఫలితముగా కొత్తగా కనిపెట్టిన అపూర్వవిషయమునుగురించి విశిష్టస్థలములలో ప్రజల కుపన్యాసములద్వారా వెల్లడిచేయదలచుకొన్న ప్రకృతిశాస్త్రజ్ఞుడున్నూ ఆయావిషయములు విపులముగా విమర్శించి బోధింపవలసినవారుగదా! వా రుపయోగించే భాష- పదములకోసము తడుముకొంటూ మాటిమాటికి ఆగుతూ ఉండకపోవడమే కాక- ధారాళముగా ప్రవాహరూపముగా వచ్చేదయి, భావముకంటె ముందుగా పరుగిడుతూ, వారికేకాక వినేవారికీ చదివేవారికీకూడా సుగ్రహితముగా ఉండవలెను గదా! వారిభాష అట్టిది కాకపోతే- అనగా వారు వాడుకచేసేపదజాలము అర్థముచేసుకొనుటకు ప్రజల కేమాత్రప్రయత్నమైనా అవసర మయేటట్లుంటే- ప్రధానవిషయ మయినభావము మరుగుపడిపోతుంది. భాషాప్రయోజనము చక్కగా నెరవేరదు.

కవి ప్రధానముగా శిల్పినీ చిత్రకారునీ పోలిఉంటాడు. అతనిరచనలు జనసామాన్యానికి కాక ఏకొద్దిమందికో - అనగా కవిత్వము అర్థముచేసుకొని ఆనందించేటందుకు తగిన కృషీ, అలవాటూ చేసుకొన్నవారికి మాత్రమే- ఉపయోగపడుతుంది. అందువల్ల అతడు సామాన్యజనవ్యవహారములో ఉన్నపదజాలము మాత్రమే వాడుకచేయవలె నను నిబంధన పెట్టుకోడు. చిత్రకారుడు తాను వ్రాసేచిత్ర

పటములో అక్కడ కావలసినఛాయ వచ్చేటట్లు వివిధవర్ణములను మిశ్రముచేస్తూ సరిచూచుకొంటూఉన్నట్లే తనచిత్రవిచిత్ర భావనలతో కూడుకొన్న భావము లన్నీ సరళముగా చక్కగా వ్యక్తము అయ్యేవరకూ పదములను ఏర్చి కూర్చి సరిదిద్దుకొంటూ ఉంటాడు. ప్రతిపదమూ పరిశీలనపూర్వకముగా ఎంచి తూచి మరీ వాడుతాడు. అతనిరచనలో భావానికి ఎంతప్రాధాన్యమున్నదో భాషకుకూడా అంతప్రాధాన్య మున్నది. భావమునకూ, రసమునకూ అనుగుణముగా ఉండే పదజాలము వాడుకచేయవలెననీ, కొద్దిమాటలతో చదువరుల మనోనయనములయెదుట భావచిత్రములు ప్రదర్శించవలెననీ, ఉచితస్థలములో సముచితమయిన పదము ప్రయోగించి అది విపుల భావగర్భితముగా ఉండేటట్లు చేయవలెననీ అతని సంకల్పము. ఒక్కొక్కప్పుడు రసస్ఫూర్తికోసము ప్రాచీనప్రయోగాలు ఎంచుకొంటాడు; మాండలికపదములూ, మారుమూలమాటలూ, గ్రామ్యములూ ఉపయోగించడానికి వెనుకతీయడు. అన్యదేశ్యాలు పరిహరించడు. ఈవిధముగా వచనరచన చేసేవారెన్నడూ సాహసించని రీతిగా భాషను తనయిష్టమువచ్చినట్లు వశముచేసుకొని ప్రయోగిస్తాడు. ఇంతేకాక అనుశ్రుతముగా వస్తూఉన్న కవిసమయములూ, కావ్యమర్యాదలూ వాని భాషను వ్యవహారస్థమయిన భాషకు మరింతభిన్నముగా చేసివేస్తవి. పదముల శక్తిని బాగా ఎరిగిఉన్నకవి, వైద్యుడు ఓషధులను ఎంతజాగ్రత్తగా తులతూచి అవసరమైనంతవరకే కలిపి మందు తయారుచేస్తాడో, అంత జాగ్రత్తగా, తగుమాత్రముగా వాటిని ప్రయోగిస్తాడు. ఇట్లు కవి ఉపయోగించే పదజాలమూ, ఆపదములను కూర్చుకొనే విధముకూడా తదితరుల పదప్రయోగముకంటె ఎంతో భిన్నముగా ఉంటవి.

భాషాశాస్త్రజ్ఞునకు భాషయెడల ఉండేదృష్టి ఇతరులదృష్టికంటె భిన్నముగా ఉంటుంది. ప్రతిపదమూ, ప్రతిపదములోని ప్రతివర్ణమూకూడా వాని కొక సమస్యవలె ఉంటుంది. పదములను విడదీసి పదప్రత్యయాది విభాగము చేసి వాటిలోని సామ్యవైషమ్యములను కనిపెట్టి వర్గీకరణముచేసి వాటితత్త్వము పరీక్షిస్తాడు. పదములస్వరూపము నానాటికీ ఎట్లు మారుతూ వచ్చినదో, మాటల కాయా అర్థము లెట్లు కాలానుసారముగా వచ్చినవో, నేడు మనము మనభాష ఈవిధముగా వాడుకొనడము ఎట్లు సంభవించినదో అనే విషయములను పరిష్కారము చేయడానికి యత్నిస్తాడు. భాషాశాస్త్రజ్ఞుడు బుద్ధిమంతుడైతే ప్రయోజన నిరపేక్షతో, కేవలము భాషాతత్త్వము తెలుసుకొని జ్ఞానమయమయిన ఆనందము అనుభవించడానికే, శాస్త్రములో కృషిచేస్తాడు. వాని ప్రయత్నఫలము భాషలోని మూలధర్మములూ, ప్రధానసూత్రములూ గ్రహించడమూ, భాష ఏవిధముగా

పరిణామము పొందినదో గ్రహించడమూ మాత్రమే. భాషాశాస్త్రజ్ఞుడు చేసేపని నగరపటము (Plan) తయారుచేయడమువంటిది. ఒకసారి పటమువైపు చూడగానే నగరస్వరూపము ఆమూలాగ్రముగా తెలిసేటట్టున్నూ, అందులోని పేటలూ, వీధులూ, రోడ్లూ, సందులూ, గొందులూ- ఏయేమూలమూలల ఏమే మున్నదో సమస్తమున్నూ కొద్దిలో స్పష్టముగా తెలిసేటట్టున్నూ వ్రాసే సర్వేపనివాని పని వంటిది. వైయాకరణుని కార్యము వృక్షశాస్త్రజ్ఞుని కర్తవ్యమును పోలి ఉంటుంది. వృక్షశాస్త్రజ్ఞుడు ప్రకృతి ప్రదర్శించేవిషయములన్నీ గుర్తించి తరుప్రపంచములోని చిత్రవిచిత్రవిషయములన్నీ వర్ణిస్తాడు. భాషాశాస్త్రము జ్యోతిషమువంటిది కూడాను. సిద్ధాంతి గ్రహనక్షత్రముల సంచారక్రమము గమనించి తాను కనిపెట్టిన విషయములు వెల్లడిచేస్తాడు. ఈశాస్త్రజ్ఞులు తాము కనిపెట్టిన విషయములు సరిగా ఉన్నవని కాని లేవనికాని, అవి అట్లుండవచ్చునని కాని, ఉండరాదనికాని, తప్పులని కాని, ఒప్పులనికాని చెప్పవలసినవారు కారు. గ్రహములూ, నక్షత్రములూ, తరువులూ, లతలూ తాము కల్పించుకొన్న సిద్ధాంతముల ననుసరించి సంచరించవలెననీ జీవించవలెననీ వారు నియమించరు. గ్రహసంచారమునూ తరుజీవనమునూ అనుసరించి ఆయాశాస్త్రము లేర్పడ్డట్టుగానే భాషాశాస్త్రముకూడా భాషాస్థితిని అనుసరించి ఏర్పడవలసినది, కనుకనే వ్యాకరణమునకు 'అనుశాసనము' అను పేరు వచ్చినది. లోకములో భాష ఏవిధముగా ప్రయుక్తమౌతూ ఉన్నదో కనిపెట్టి దాని ననుసరించి ఆసూత్రములు కల్పించవలెను కదా! ఏదయినా ఒకకాలములో వ్యవహృతమయినభాషకు వ్యాకరణము వ్రాయవలసివస్తే వైయాకరణుడు నాటిభాషను సర్వతోముఖముగా శాస్త్రదృష్టిని పరిశీలించి ఉత్సర్గాపవాదములు ఏర్పరించి భాషలో కనబడే ఎల్లవైవిధ్యములనూ వింతవిషయములనూ వైచిత్ర్యములనూ ప్రదర్శించవలెను.

వాఙ్మయములుగల కొన్నిభాషలవిషయములలో మన ఆంధ్రభాషలోవలెనే వ్యాకరణశాస్త్రజ్ఞుల దృక్పథము అపమార్గము బట్టినది. భాషానియంతల మనేభావముతో తమకు లేనిఅధికారము వారు స్వీకరించినారు. భాషాశాసనము కాపాడే భారము తమమీద ఉన్నదనీ, భాష సామాన్యప్రజలకు అందుబాటులో ఉండకుండా ఉచ్చస్థితిలో ఉంచడము తమవిహితధర్మమనీ, కవులూ గ్రంథకర్తలూ తాము నిర్మించిన సూత్రములు మీరకుండా గ్రంథరచన చేయవలెననీ అపోహపడుతున్నారు. అశాస్త్రీయమయినదృష్టితో, పరిమితమయినపాండిత్యముతో, దుర్భరమైన లోపయుతనియమములతో కూడుకొన్న వారి వ్యాకరణములు అశాస్త్రీయములూ,

అసమగ్రములూ, దోషభూయిష్ఠములూ, అయథార్థములూ అయినవి. సహజమైన సహానిధారణిని ప్రవాహరూపముగా పోయేభాషాస్రవంతిని అరికట్టుటకై ఇరుప్రక్కలను ఎత్తైనగట్లు కట్టి దానిగమనమున కొకసూటి అయినమార్గము నిర్మింపవలె నని పూనుకొనడము వెర్రిపని కాదా ? భాషాస్రవంతి ఆత్మపోషణార్థము ఉపనదులనుండి నీరు రాబట్టుకొంటుం దనీ, తన కనుకూల మయినరీతిని ఎప్పటి పరిస్థితుల ననుసరించి అప్పుడు కొంతవరకు మార్గముమార్చుకొంటూ ఉంటుందనీ, వరదలసమయములో గట్ల నతిక్రమించి పొరలి పారుతుందనీ, కొన్నాళ్ళకు తనంతట తానే తిరిగి స్తిమితపడి తేటతేరి ఉంటుందనీ వా రెరుగరు కాబోలు ! భాషా శౌచమును కాపాడవలె ననే ఉద్దేశముతో దానికి సంకెలలు వేసి, ఇతరభాషలతో సాహచర్యము లేకుండా బంధించి, అభివృద్ధికరముగానూ పోషకముగానూ ఉండే నూతనపదజాలమును దరికి రానీయకుండా తొలగించి నేటిపరిస్థితులకు భాష పనికిరాని దానినిగా చేస్తున్నారు అందువల్ల గ్రాంథికభాష పురాతనవస్తుప్రదర్శనశాలలో ఉంచుకొని వేడుకకోసము చూచి ఆనందించుకొనే వస్తువులకు తుల్యముగా అయిపోతున్నది. కాలము మళ్ళినపండితకవుల యిళ్ళలో అది కుంటినడకలతో అక్కడక్కడ కనబడుతూ ఉండేఅవస్థకు వచ్చినది.

మనవ్యాకరణములు అపమార్గము పట్టి ఉండడమువల్లనూ, వైయాకరణుల ప్రభావము పండితులను ఆవహించి ఉండడమూ, పండితులే మొన్నమొన్నటి వరకూ మనభాషలో కవులూ గ్రంథకారులూ అయిఉండడమూ, వీటన్నిటిఫలితంగా కృతకభాష కృత్రిమ మయినశైలి వాడుకలోనికివచ్చి దుష్టమైన అభిరుచులూ ఆదర్శములూ నెలకొన్నవి. సర్వవిధము లయినగ్రంథములలోనూ భావమునకూ విషయమునకూ కాక భాషకూ శైలికీ అనుచితమైన ప్రాముఖ్యము ఇవ్వబడ్డది. దీనివల్ల చదువుకొన్నవారిలో కూడా చాలామందికి గ్రంథరచన అంటే భయము ఏర్పడ్డది.

శాస్త్రీయముగా భాషాపరిశోధనము ఆరంభమయి పండితుల నిరంకుశాధికారము ధిక్కరించి భాషాసంస్కరణము చేసి సనాతనసంప్రదాయానుసారముగా శిష్టులు వ్యవహరించేభాషను పునఃప్రతిష్ఠితము చేస్తేనే కాని విద్య వ్యాపించదనే నూతనాభిప్రాయము విద్వాంసులలో నెలకొన్నతర్వాత వ్యావహారికభాషావాదమును బయలుదేరదీయడానికి ఒకసంఘము ఏర్పడ్డది. అప్పు డాంధ్రపండితలోకములో రెండుపక్షము లేర్పడ్డవి. ఒకపక్షమువారు సర్వవిధము లయినరచనలకూ వ్యవహారములకూ గ్రాంథికభాషే ఉపయోగించవలె నని బోధించేవారు ; రెండవపక్షమువారు వ్యవహారసిద్ధమై జీవముతో ఉట్టిపడుతూ ఉన్నభాష- అందులోనూ

శిష్టవ్యవహారములో ఉండి ఆంధ్రదేశమం దంతటా ఇంచుమించు ఏకరూపముగా ఉన్నది- సమస్తవ్యవహారములకూ గ్రంథరచనకూ కూడా ఉపయోగించవలె నని వాదించేవారు.

ఈరెండుపక్షములకూ సమాధానము కుదర్చవలె నని కాబోలు ఈనడుమ ఇంకొకపక్షముకూడా బయలుదేరినది. భాష అంటే ఏమిటో నిశ్చితాభిప్రాయా లేవీ లేకపోవడమువల్ల రెండుపక్షములవాదములోనూ గ్రహింప దగినవిషయము కొంత ఉన్న దనీ, అనవసరమయినతగవులలో బడి కాలయాపనము చేయడము తగ దనీ, భాషాభ్యుదయమే ఇరుతెగలవారి ఆశయమూ కావడమువల్ల అటు పాషాణగ్రాంథికమూకాక ఇటు వీరవ్యావహారికమూ కాక మధ్యమార్గ మవలంబించడము సముచితముగా ఉంటుం దనీ చెప్పవచ్చినారు. అయితే వారిపద్ధతి ఏపక్షమువారికీ నచ్చలేదు. అది భాషకు అనర్థదాయక మని రెండుతెగలవారూ అభిప్రాయపడ్డారు. వాస్తవముగా సత్యాసత్యములకు నడుమ ఎన్న దగినఅంతరువు ఏమీ ఉండదు గదా !

వ్యావహారికభాషావాదము బయలుదేరకపూర్వము విశ్వవిద్యాలయాధికారులూ విద్యాశాఖాధికారులూ పండితులప్రభావానికి లోబడి గ్రాంధికభాషనే ఆదరించినారు. మాతృభాషద్వారా విద్యనేర్పి ప్రజలలో విజ్ఞానము వ్యాపించేటట్టు చేయడమే వారు తలపెట్టినకార్యమైనా, ఆకార్యము వ్యావహారికభాషవల్లనే కాని నెరవేరడము అసాధ్యమైనా, ఈఅపమార్గములో పడిపోయినారు. వ్యావహారికభాషను బహిష్కరించినారు. ఇప్పుడు బడులలో ఎంతోప్రయాసపడి చిన్నపిల్లలకు బోధిస్తూ ఉన్నభాష వ్యవహారచ్యుత మయినకావ్యభాష. ఇది బడిపిల్లలకూ ఉపాధ్యాయులకూ బడిపిల్లలకోసము పుస్తకాలు వ్రాసుకొని జీవించే గ్రంథకారులకూ తప్ప ఇంకెవ్వరికీ- న్యాయవాదులకుగాని, న్యాయాధికారులకుగాని, ప్రభుత్వోద్యోగస్థులకుగాని, వైద్యులకు గాని, వ్యాపారస్థులకుగాని, పత్రికాధిపతులకు గాని, వక్తలకుగాని, మతబోధకులకుగాని, గ్రంథకర్తలకుగాని ఇంకెవ్వరికీగాని- ఈకాలములో అక్కరలేదు.

పైని పేర్కొన్నపరిస్థితులలో భాషాపాండిత్య మంటే ప్రాచీనయుగములలో భాష ఏయేవిధముల ప్రయుక్త మైనదో పరిశీలించడమూ, ప్రాచీనకవులభాష అర్థముచేసుకొని వారిమాదిరిగా వ్రాయగలిగి ఉండడమూ, ఆభాషలో ఉండే నియమాలూ, కట్టుబాట్లూ ఆభాషాతత్త్వమూ ఎరిగి ఉండడమూ, ప్రాచీనవ్యాకరణములూ కోశములూ సవివరణముగా వల్లెవేయడమూ మొదలయినశక్తులు సంపాదించి ఉండడ మన్నమాట. ఇట్టి అపూర్వప్రజ్ఞాసంపన్నులయిన ఛాందస

పండితులు నేటిభాషలో ఉండేవైచిత్ర్యములు పరిశీలించరు: జాతీయప్రయోగ ములూ, మాండలికభేదములూ, వివిధరీతుల ఉండేపలుకుబడులూ, ఉచ్చారణలో ఉండేవైవిధ్యమూ, స్వరమూ, ఊతా, భాష ఏయేరీతుల మార్పుపొందుతూ ఉన్న దో, ఏయేవిధముల మార్పు చెందేటట్లు సూచనలు కనబడుతున్నవో, అన్యభా షలప్రభావము మనభాషపై ఎంతవరకు ఉన్నదో, నవ్యపదజాలములో ఉన్న విశేషలక్షణ మేమిటో మొదలయినవిషయములు ఏవీ వారు గమనించరు. వాస్తవ ముగా ఈవిషయములే ఇతరదేశములలో భాషాబోధకులు అత్యవసరము లని ఎన్నుకొంటారు. వీటిలో పరిశోధన చేసినవారే పండితు లనిపించుకొంటారు. ఈ విషయములన్నీ సమగ్రముగా బోధిస్తేనే కాని మాతృభాషలో సరసముగా, నాజూకుగా వ్యవహారము చక్కపెట్టుకో లేరనీ, వివిధతరగతుల ప్రజలతో యథో చితముగా మాట్లాడడము అలవడ దనీ భావిస్తారు. అయితే మనదేశములోమాత్రకు విద్యావిధానమూ భాషాభ్యాసమూ నిత్యజీవనమున కుపయోగపడే అధునాతన విషయములను వెలివేసినవి. ఈఅపమార్గములో ఎంతకాలము పడిఉండడము?

ప్రకృతిశాస్త్రరహస్యములను చక్కగా వ్యక్తము చేయడానికి సమర్థమయిన భాష ఏర్పడేటట్లు కృషిచేయడము మన కత్యంతావసరము. మనదేశములో ఇతర ప్రాంతాలలో ప్రజలు ముందంజవేసి మార్గముచూపుతున్నారు. దేశభాషలలో నూతనవిజ్ఞానము వ్యాప్తమౌతూ ఉన్నది. మనభాషావిషయములో కూడ విశ్వ విద్యాలయాధికారులూ విద్యాశాఖాధికారులూ శ్రద్ధవహించి గ్రాంధికవ్యావహారిక భాషలు ఒకదానికొకటి పోషకముగా ఉండేవిధానము — ఇతరభాషలలో అ దెట్లు చేకూరినదో పరిశీలించి ఆరీతిని- నిర్ణయించి ప్రకృతపరిస్థితుల కనుకూలముగా ఉండే టట్లు భాషావ్యవస్థ కల్పించవలసి ఉన్నది. ఈప్రయత్నము ఇప్పు డయినా ప్రారం భించక ఉపేక్షవహిస్తే స్వకార్యనిర్వాహణములో వెనుకబడ్డా రనేనిందకు పాల్పడ తారు, భాషకు ద్రోహముచేసినవా రవుతారు.

*

# వేగు

శివరామం.

తెరచుకొన తూర్పుతల్పు బంగరువెలుంగు
దెసల మిసిమింప నొకవింతతేరు కదిలె;
వెడలె నాదు పుడమి జూడ వేగుపడతి
పులుగులే పాడ తీవలే పూలు గురియ.

ఒక సిరి గలామె మెత్తపై నొరగి మేను
మఱచినది, మేలుకో వేళ యెరుగ లేదు;
ఒక ముసలియయ్యవారు ముక్కుకొన చూపు
నిలిపినా డేటియొడ్డునం దులుకు లేక.

దూరముగ తొందరగ తేరు తొలగిపోరు
గములుగా జిమ్ముకొనుచు చీకటులపొగలు.
ఆగక యెడంద నూగు తీయనితలంపు
లెన్నొ పాట పాడిన దింటి కన్నెపడుచు;

ఒడలె యెరుగ డాయురడమ్మ నడచుదారి
మరికినా డప్పు డుడుకునెత్తురు గలాడు.
విరిసినవి లేగులాబులు వేలు వేగు
వెలది కనకొసల మోసల, పెదవితుదల.

*

# తెలుగుతోట

కందుకూరి రామభద్రరావు

ఎంత చక్కనిదోయి ఈతెలుగుతోట
ఎంత పరిమళమోయి ఈతోటపూలు

ఏవందనమునుండి
యీనారు నాటిరో!
ఏస్వర్ణదీజలము
ఈమడుల కెత్తిరో.

ఇంత వింతలజాతు లీతోటలో పెరుగు!
ఈతోటయేపులో నింత నవకము పెరియు!

ఏయమృతహస్తాల
ఏసురలు సాకిరో!
ఏయుచ్ఛ్వరలమారుపు
ఈతీరు దిద్దెనో!

ఈపూలపాలలో నింత తీయుదనము!
ఈలతలపోకిళ్ళ నింత ఒయ్యారమ్ము!

ఏమహాత్తరశక్తు
లీతోటలో గలవో!
ఏదివ్యతేజస్సు
కీనుమమ్మలు నెలవో!

ఈతోటపైగాలి యింత మెయి సోకనా
ఈనీరసిలుబ్బదుకు ఇంత చివురింపనా

జవరాలివలపు వలె
రవిబింబదీప్తి వలె
హిమశిఖరి శీవి వలె
ఋషివాక్కుప్రతిభ వలె

నాదుతలపులు రేపు నా తెలుగుతోటలో
పాడుకొననిం డోయి! వలపింపనిం డోయి!

# దివ్యదర్శనము

పెద్దిభట్ల రామచంద్రరావు

నిశ్చలంబయి నిశ్శబ్ద నిలయమగుచు
కరము భీతావహం బైన కాళరాత్రి
నిన్ను గనుకాంక్ష సమ్ముగ్ధ నిబిడరక్తి
నిల్చితిని నేను నీద్వార నికటమందు.

హృదయ సంఫుల్లశాలి పూర్ణేందుకళల
భాతి నీముఖసద్మ లావణ్యరుచులు,
ద్వారశకలాగ్రముల నెల్ల దరిచికొనుచు
హృదయ సుమమును విప్పార్చి యింపు లొలికె.

తెరచికొనిపోయె · ద్వారముల్ దివ్యమహిమ
ప్రక్క కిరుదెంచి కంటి నీభవ్యమూర్తి
కరము నేత్రోత్సవంబయ్యె గాత్రలతిక
వివశ నొనరించె. నీదీప్తి విస్మయంబు.

నిలిచి పోయితి నల్లె నీ నిలయమందు
మలయ మారుతవీచికల్ మలయుచుండ
నుదయరేఖల రక్తిమ విదితమయ్యె
ఉదయరేఖలు దోచె నాహృదయమందు.

*

# గ్రంథ విమర్శనము

## ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

### సంపుటము ౨౯ : సంచికలు ౧-౨

ఆంధ్రసాహిత్యపరిషత్తుకు రజతోత్సవము చేయవలసిన సమయమంటే పరిషత్పత్రిక సైజు ఎందుకో తగ్గి పోయినది. ఇన్నాళ్ళనుండీ రాయలు అక్టేవో సైజులో వచ్చేది. ఇప్పుడు డెమ్మీ అక్టేవో సైజులోకి దిగి నది. అన్నివిధములా పెద్దరికానికి ప్రయత్నించే ఈపత్రికకు ఇందులో చిన్నరికము రావడము శోచనీయము. వీరికి ఆదర్శప్రాయు లైన విదేశపండితులుకూడా సైజుతో గురుత్వము (Respect-ability) రావలె నంటారు.

మొదటిసంచికలో 'స్వవిషయము' రెండుపేజీలే ఉన్నా, ఆలోచించవలసిన విషయాలు ఉన్నవి.

"—— ఇచ్చిన వరమో దారు లిచ్చిరి. ఇచ్చిరి కావుననే యీరజతోత్సవము లోకము చూడఁ దల స్థించినది. ఇఁకమీఁదఁ బరిషత్తునకు దేశాభిమానులు, భాషాభిమానులు సగుధనికులు విద్యాధికులుఁ దోడ్పడిన మఱికొంతకాలము నిర్విఘ్నముగాఁ జరుగఁగలదు. తమతమ మిత్త్రులం బ్రోత్సహించి పూర్వపాఠకులును గ్రొత్తపాఠకులం జేర్చి విద్యాభిమానులును దోడ్పడఁగోరుచున్నారము.

"దేశమునకుఁ గావలసినది మొదట విద్య, దానికి తోడ్పాటు లేదు. మఱి దేని కని రెస్తి చేసినఁ బ్రయోజనమేమి? మూలమునకు దోహదము చేయనిదే శాఖలతో నంటుగట్టఁ దలఁచిన నత్తుకొనక పెట్టీతలలు వేయును. శుష్కవాదములను విని మెచ్చువారే కాని నిక్కముగఁ బనిచేయుచున్నవారి నాదరించు వారు తక్కువ."

ఆంధ్రసాహిత్యపరిషత్తుకు ఎందరు మహారాజులూ, ధనికులూ ఎంతెంత ధన మిచ్చినారు ? జయంతి రామయ్యపంతులుగారివంటి పండితులు ఎంతమంది ఉచితముగా తమ శక్తి ధారపోసినారు ? ఇరవై యైదేండ్లు ఇంత ప్రయత్నము చేసినా దాని ఫలితమేమిటి ? ఇప్పటికి నిఘంటువులో ప్రథమసంపు టము ప్రకటించినారు. ఇరవైనాలుగేళ్లు పరిషత్పత్రిక నడిపినారు.

ఈ నిఘంటువు ప్రథమసంపుటమును విపులముగా ముందుసంచికలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు విమర్శిస్తారు.

"గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోరు ;
నోగిఁ జయంతి రామయోక్తి గెల్చె"

అని వడ్డాది సుబ్బారాయడుగారు వ్రాసినమాటలు ఎంతసత్యములో అవిమర్శనము చూచిన తర్వాత ప్రాజ్ఞులే నిర్ణయించుకోగలరు.

ఈ సంపుటము ముఖపత్రముమీద "పండితసాహాయ్యమున జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. ఎల్. గారిచే రచింపఁబడి" అని ఉన్నది. పత్రికాసంపాదకులు పత్రికలు రచించినారని ప్రయోగించే మర్యాద లోకములో లేదు. జయంతి రామయ్యపంతులుగారు సంపాదకులుగా ఉన్నారనే అనుకుంటూ వచ్చినాము కాని నిఘంటురచయితగా పనిచేస్తున్నా రనుకోలేదు. వారుకూడా నిఘంటు సమర్పణసమయములో 'నిఘంటుసంపాదకత్వము వహించి కార్యనిర్వహణము చేయవలయునని

మహారాజావారు నాకొకజాబు వ్రాసిరి' అని తమ సంపాదకత్వమునే చెప్పుకున్నారు. అచ్చుతప్పేమో అని తప్పొప్పుల పట్టిక చూస్తే అందులోనైనా దిద్దిలేదు. ఈనిఘంటువుకు మార్గదర్శకులైన కాంబెలు పండితుడూ, బ్రౌనుపండితుడూ, తాము నిఘంటువులు రచించినామని వ్రాసుకున్నారేమో, అమర్యాదనే ఇందులోనూ అవలంబించినారేమో అనుకున్నాము. లేకపోతే 'రచింపబడినది' అనే శబ్దానికి 'సంపాదింపబడినది' అనే అర్థము వారు సాధిస్తారేమో, కాని ఆఅర్థము ఇప్పటివున్న నిఘంటువులలో కనపడదు. ఈపండితప్రయోగాన్ని అనుసరించి సూర్యరాయాంధ్రనిఘంటువులో ఈకొత్తఅర్థము వ్రాస్తారేమో చూడవలసిఉన్నది. ఇంత గొప్పనిఘంటువు రచనకు సహాయభూతులైన ఆపండితుల పేర్లైనా ఈనిఘంటువు ముఖపత్రముమీద ప్రకటించడము ప్రకాశకుల విధి అనుకుంటాము. కాని ముఖపత్రముమీదనే కాక మరి ఎక్కడాకూడా ఆపండితుల పేర్లే లేవు. ఎక్కువ ప్రతులు లోకములో ప్రచారములోకి పోకముందే ఈముఖపత్రము తీసివేసి లోపములు పరిష్కరించి వేరొకముఖపత్రముతో నిఘంటువు ప్రకటిస్తారని ఆశిస్తున్నాము.

ఇక ఇరవైనాలుగేళ్లు నడిపిన పరిషత్పత్రిక సంగతి! ద్వితీయపురుషార్థము ప్రధానముగా ఉన్న ఈకాలములో ఖరీదుకట్టడము అలవాటైపోయింది. ఈరెండుసంచికలూ ప్రచురించినందువల్ల ఆంధ్రవాఙ్మయానికి ఏమి ప్రయోజనము కలిగిందో విలువ కట్టి చూతాము!

ఇందులో మొదటి సంచికలో ౧. స్వవిషయము, ౨. చిన్నపూలు, ౩. ఆంధ్రభాషయందలి ద్రుతస్వరూపము, ౪. గ్రంథస్వీకారము, ౫. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు, ౬. సంధి, ౭. తాతాచరిత్రము, ౮. కావ్యశ్రీ, ౯. భాసుడు, ౧౦. రఘునాథరామాయణము, ౧౧. లక్షణసారసంగ్రహము— అనే విషయము లున్నవి.

రెండవసంచికలో, ౧. ఆధునిక వాఙ్మయము, ౨. పొగడదండ, ౩. గ్రంథస్వీకారము, ౪. భాసుడు, ౫. శ్రీరాధామాధవము, ౬. కీ.శే. వావిలికొలను సుబ్బారావు పంతులుగారు ౭. జనవాణి, ౮. సుపథము ౯. రఘునాథరామాయణము, ౧౦. లక్షణసారసంగ్రహము, ౧౧. కవిజనోజ్జీవని (సమస్యలు)— అనేవిషయము లున్నవి.

మొదటిసంచికలో (రెండవసంచికలోగూడా అంతే) కొన్నివిషయములపేర్లు గొప్పగా ఉన్నా అవి సమగ్రములూ, స్వతంత్రములూ ఐనరచనలు కావు 'ఆంధ్రభాషయందలి ద్రుతస్వరూప'మనేది యల్. వి. రామస్వామి అయ్యరుగారి వ్యాసములో కొంతభాగానికి ఖండనముమాత్రమే వ్రాసిన చిన్నవ్యాసము. కాని ద్రుతస్వరూపము ఇందులో చూపవలెనని ప్రయత్నమే చేయలేదు. 'సంధి' అనేదికూడా అంతే. ఇది శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి 'సంధి' అనేగ్రంథముమీద రంధ్రాన్వేషణపరముగా వ్రాసిన వ్యాసము. ఆ అన్వేషణఫలిత మిది. అందులో,

> "కన్నడవైయాకరణుల పద్ధతి తెలుగువారిదానివలె సంస్కృతపక్కి ననుసరింపక ద్రావిడభాషాసాంప్రదాయమునే యవలంబించుచున్నదని చెప్పవలసియున్నది'' అని ౨౬వ పుటయందును, 'ద్రావిడభాషలలోని సంధివిధానమునకును, సంస్కృతభాషలోని సంధివిధానమునకును, సంబంధమేమాత్రమును లేనట్లగపడుచుండుటేగాక యివి భిన్నపద్ధతుల ననుసరించి బయలుదేరినట్లుకూడ తోచెడిని' అని ౩౯వ పుటయందును గలదు. ఇట్టివాక్యములు పరస్పరవిరుద్ధములు."

అని వ్రాసినారు. వాక్యార్థములు పరీక్షించి వాదించే వృత్తితో జీవిస్తున్న మాకుకూడా ఆవాక్యములు ఎంతపరిశీలించినా అందులో పరస్పరవైరుధ్య మేమీ కనిపించలేదు. అందులో మొదటివాక్యములో వైయాకరణులు నిబంధనలో అవలంబించినమార్గములు చెప్పినారు. రెండవవాక్యములో సంధిస్వరూపమునుగూర్చి చెప్పినారు. ఆవాక్యములు చదివిన పామరులకుకూడా ఈ అర్థము ప్రత్యక్ష

ముగా స్ఫురిస్తుంది. మరి ఈస్వల్పవిషయము ఆవ్యాసమువ్రాసిన పత్రికానిర్వాహకు లైనపండితులకు ఎందుకు తోచలేదో ! దోషైకదృక్కుల చిక్కు లెప్పుడూ ఇటువంటివే !

'తాతాచరిత్రము' అనేది ఆపేరుగల పుస్తకముమీద చిన్నవిమర్శనము. 'కావ్యాత్మ' అనేది కూడా అంతే. 'చిన్నిపూలు' అనేది కవిత్వంలేని పదిపద్యాల సమూహము. ఇక ఒక్క 'భాసుడు' అనేదిమాత్రము వ్యాసమే. 'రఘునాథరామాయణమూ' 'లక్షణసారసంగ్రహమూ' వేరుగా పుస్తకాలుగా ప్రచురించక పత్రికలో ముక్కలు ముక్కలుగా ఎందుకు ప్రచురిస్తున్నారో మాకు తోచదు. ఇది ఆచారమైపోయినదంటేమాత్రము జవాబు చెప్పలేము. అందులో 'రఘునాథరామాయణము' ప్రచురణమైన భాగాన్ని బట్టి చూస్తే, మన తెలుగులో మొదటినుంచీ రామకథ చక్కని కావ్యముగా వ్రాయవలెనని ప్రయత్నించి సాఫల్యముకాక రామకథాస్మరణవల్లనె చరితార్థు లైనవారిలోకూడా గొప్పస్థానము ఆక్రమించుకోలేనివాడుగా కనపడుతున్నా డీకవి. ఐతే 'పూర్వకవి' అంటేనే పోనీ నమస్కరిద్దాము! 'శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు' అనేది పిఠాపురం మహారాజావారికి నిఘంటు సమర్పణము చేయడానికి ౫-౮-౩౬ న జరిగిన సభావృత్తాంతము. అసభకు తెలుగురాని అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారు అగ్రాసనాధిపత్యము వహించడము సమంజసముగానే ఉన్నది. అందులో మహారాజావారు నిఘంటునిర్మాణానికి చేసిన అపారధనసహాయమునుగూర్చి జయంతి రామయ్య పంతులుగారు ఉచితముగా భాషాభిమానమువల్ల చేసిన శ్రమనుగూర్చి అందులో అర్హమైనవిధముగా స్తుతించినారు. వారి ఉభయకుటుంబములవారూ అది ఎల్లప్పుడూ సగర్వముగా స్మరించుకొంటూ ఉండదగిన విషయము. ఇక 'గ్రంథస్వీకారము'లో మూడు గ్రంథాలు విమర్శించారు. అందులో ఒకదానిలో "'శరములఁ దాల్త్రి' అనుటకంటె 'శరములఁ గొంద్రు' అనుట తగునేమో యను కొందుము" అని వ్రాసినారు. 'తాల్త్రి' అనేరూపము తప్పేమో, కాని తప్పంటే ఏమి తగాదా వస్తుందో అని వ్రాసినట్లుగా ఉన్నది. పరిషత్పత్రికలో సూచించినరూపము ఆపద్యములో వాడితే ఆంధ్రభాషకు ఏమి మహోపకారము కలుగుతుందో గోచరించలేదు.

రెండవసంచికలో 'పొగడదండ' అనేది శ్రీనాథుని దని ప్రతీతి ఉన్న 'కవిరాజు కంఠంబు కౌగిలించెనుగదా పురవీథి నెదురెండ పొగడదండ' అనేపద్యములో 'పొగడదండ' అనే మాటకు అర్థాన్వేషణము. గ్రంథస్వీకారములో నాలుగుపుస్తకాలమీద అసమగ్రమైన విమర్శన లున్నవి. 'భాసుడు' సరేసరి. 'శ్రీరంగధామాష్టకము' అనేది ఆపేరుగల ప్రాచీనకావ్యముమీద విమర్శన అనేపేరుతో ప్రారంభించిన వ్యాసము. శ్రీ వావిలికొలను సుబ్బారావుగారినిగూర్చి ఈ పత్రికలో విపులంగా ఉంటుం దనుకుంటే ఒకపేజీలో పూర్తిచేసినారు. వారు రచించిన గ్రంథాలపేర్లైనా సమగ్రంగా ఉదాహరించలేదు. 'జనవాణి' అనేది ఆ పత్రికనుగూర్చి అడ్వరుటైజుమెంటువంటి విమర్శన. 'సుపక్షము' అనేది అందములేని కందపద్యాష్టకము. 'కవిజనోజ్జీవని' అని సమస్యాపూరణలపుస్తకము ఒకటి కొత్తది ప్రారంభము. ఈసమస్యాపూరణమువంటి పద్యాలు అల్లే గారడీపుస్తకాలు ఆంధ్రకవిత్వానికి అభివృద్ధికారణాలనే కాబోలును పరిషత్తువారిభావము ! ఇక 'ఆధునికవంగవాఙ్మయము' అనేది పేరువల్ల ద్యోతమయ్యేట్లు వ్యాసము కాదు. డాక్టరు కాళిదాసనాగమహాశయుల వ్యాసమునుండి ఒకపేరా తీసి దానికితోడు తత్తుల్యమైన మరికొన్ని వాక్యాలు కలిపి వ్రాసిన వాక్యసంచయము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక అంటే అది ఇప్పటి ఆంధ్రసాహిత్యము వృద్ధి కావడానికి సహాయ మవుతుందని ఆశించినాము. కాని అట్లా సహాయపడక పోగా అప్రయత్నముచేసేవాళ్ళను వృథాగా జాగ్రత్త జాగ్రత్త అంటూ వెనక్కు లాగుతూ ఉండడము చూస్తే ఆశ్చర్యము కలిగిస్తున్నది. ఈవిధముగా వ్రాయకపోతే "ఆంధ్రసాహిత్యపరిషత్తు ౧౯౧౧ లో పుట్టినది. అంతకుపూర్వపు వాఙ్మ

యేను కాని తర్వాతది తనికిమాలినది. ఇక కావ్యాలు ఎవరూ వ్రాయరాదు. ఇది ఒక్క తెలుగులోనే కాదు, — కన్నడము, మలయాళము, మహారాష్ట్రము, వంగభాష — అన్నిటిలో అంతే!" అని ధైర్యముగా ఎందుకు చెప్పరాదు? ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ౨౪ వ సంపుటము ౧౧౫-౧౧౯ పేజీలలో ప్రచురించిన పండితాభిప్రాయాలనేవీ, వాటిని గమనించవలసినదంటూ ఉద్బోధిస్తూ ౨౫ వ సంపుటము ౪౯-౫౦ పేజీలలో వ్రాసినవీ చదువుతే, ఏదేశములోనైనా ఏకాలములోనైనా ఎవరో ఒకరు ఒకటేవిధమైన అభిప్రాయాలూ భయాలూ కలవాళ్ళు ఉండకపోరని అనిపిస్తున్నది. మా అమ్మమ్మగారు తొంభైయేళ్ళది. అంధురాలు. నేను రాజవీధిన పనిమీద పోతూ ఉంటే "అయ్యా, జాగ్రత్త నాయనా, బళ్ళు ఉంటాయి జాగ్రత్త" అనకుండా ఎప్పుడూ ఊరుకోదు. అటువంటి పెద్దలు అన్నిదేశాలలోనూ ఉంటారు!

ఈ పండితులంతా మాటిమాటికీ ‘సులభశైలి’ అనేమాట వాడుతూవుంటారు. ‘శైలి’ అనే మాట ఆలంకారికులెవ్వరూ వాడినట్లుగా తోచదు. అది స్టయిలు [Style] అనే ఇంగ్లీషుమాటకు పర్యాయపదంగా వాడుతున్నారని ఊహించవలసివున్నది. గ్రంథకర్తస్వభావాన్నిబట్టి మాటలు ఏరుకోవడములోనూ వాక్యాలు, పేరాలు ఇత్యాదులు కూర్చడంలోనూ ఉండే ప్రత్యేక విధానాన్ని ఇంగ్లీషులో స్టయిలు అంటారు. అది సులభముగా ఉండవలెనని ఏ సాహిత్యశాస్త్రజ్ఞుడూ నియమించడు. ‘ఈవిధమైన స్టయిలు ఈకవికి ఉన్నది అందువల్ల ఈగుణాలూ లోపాలూ వచ్చినవి’ అంటారు. మన పరిషత్పత్రికలో మాటిమాటికి ‘సులభశైలి’ అని వ్రాసినట్లుగా ఇంగ్లీషుపుస్తకాలవిమర్శనలో ఈజీస్టయిలు [Easy style] లో ఉన్నదని అంటూవుంటే గాని, భాషలో ఈజీస్టయిలు ఉండవలెనని నిబంధన చేస్తేకాని ఇంగ్లీషుపండితులు స్కూలుపిల్లకాయలవ్రాతలని చిరునవ్వు నవ్వుతారు.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక విద్యాధికుల ఆదరం పొందవలెనంటే లోకానికి ఉపకరించే విధముగా పూర్తిగా మార్పుచేయవలె.

శో. న. శా.

వీణ (సాహిత్యమాసపత్రిక) చందా రూ 2.

సంపాదకుడు: పాటిబండ మాధవశర్మ, ఎం. ఏ., (ఆనర్సు)

‘వీణ’ ఆఫీసు, తేలప్రోలు, కృష్ణాజిల్లా.

ఈమధ్య కొన్ని మాసపత్రికలు బయలుదేరినవి. ‘వీణ’ వాటి అన్నిటికంటె సర్వవిధాలా శ్రేష్ఠమయినది. అచ్చుకూర్పు మొదలుకొని అంశములదాకా చాలావిశిష్టంగా ఉన్నది. ఇప్పటికి వచ్చినవి మూడు సంచికలు.

ఈ పత్రికకు నవీనులలో అనేకులు వ్రాస్తున్నారు. శ్రీరంగం శ్రీనివాసరావు, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, పురిపండా అప్పలస్వామి, తుమ్మలపల్లి వెంకటరత్నం, విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి, కందుకూరి రామభద్రరావు మొదలైనవారి పద్యాలున్నవి. ‘బహూకూనము’, ‘అల్లాకే ఫకీర్’, వెంపటి నాగభూషణంగారి ‘ఎండమావులు’ అనేకకథలు మనోరంజకములు. మాధవశర్మగారి ‘భావకవిత్వం’ వ్యాసాలు బాగున్నవి. ‘క్రుకులు’ అనే శీర్షికతో సంపాదకీయవ్యాఖ్యలు

చురుకుగా, మచ్చటగా, fresh గా ఉంటున్నవి. 'కళ - కళాభిజ్ఞత' శ్రీపాద గణపతిరావుగారి 'హిందూదేశము - జనసంఖ్య', అరవిందుని 'ప్రాచీనరాష్ట్రతంత్రము', గుమ్మడిదల సుబ్బారావుగారి 'ముసలమ్మ సమస్య - శాస్త్రధర్మములు' అనేవ్యాసాలు జ్ఞానప్రదములు. మద్దాలి సూర్యప్రకాశరావు గారు 'శిల్పి వరదా వెంకటరత్నం' గారి విషయమై వ్రాసిన వ్యాసం చాలా బాగున్నది. ఇతర శిల్పులనుగురించికూడా క్రమంగా వ్రాస్తా రనుకుంటాము.

'వీణ' లో తిరస్కారాలు పడుతున్నవి. సాధ్యమైనంతవరకు తగ్గిస్తే బాగుంటుంది. వివిధవిషయాలను చర్చించేటందుకు 'భారతి' మొదలైనపత్రికలు ఉండగా ఇందులో సాహిత్యవిషయాలు మాత్రమే ప్రకటిస్తే మేలని తలుస్తాము. అతినవీనుల రచనలకు తావిచ్చి, బాగా 'నవీనదృష్టి' కలిగించి, విశిష్ట సారస్వతసృష్టికే 'వీణ' తోడ్పడితే పత్రిక సార్థక మవుతుంది.

## తాతాచరిత్రము (వెల ౦-౧౦-౦)

కొమాండూరి శఠకోపాచార్యులు, ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ

ఇది వైష్ణవుల చరిత్ర కాదు. జంషెడ్జీ నస్సర్వాంజీ తాతా అనే పార్సీకోటీశ్వరుడి జీవితచరిత్ర. ధనికుల కథలు చదవడం మంచిదికాదు. దానివల్ల సామాన్యులకు వృథాగా ధనంమీద ఆసక్తి పుట్టి, చాలా అన్యాయాలు చెయ్యడానికి ప్రోత్సాహ మిస్తుంది. అయితే దాతృత్వంవల్ల కొంతమంది ధనికులు పేరు సంపాదిస్తారు. మామూలు దానధర్మాలుకాకుండా మహత్తరమై, లోకోపకారాని్కి అనుకూలించే గొప్పసంస్థలు నెలకొల్పడమూ, వాటిని పోషించడమూ చేస్తే ధనికుణ్ణి చాలామట్టుకు క్షమించవచ్చు. "అయన ధనమును పరమావధిగ నెంచక, సత్కార్యసాధనముగనే యెంచెను" అనేవాక్యము భూమికాంతంలో చూసినపుడు పుస్తకము పూర్తిగా చదువుదా మనుకొన్నాను.

౧౯౧౬ లో బొంబాయినగరంలో అడుగుపెట్టి కొద్దిదూరము నడిచేసరికి కనపడ్డది పెద్దలోహ విగ్రహము. 'ఎవరిది?' అని పక్కనడిచే మిత్రుణ్ణి అడిగితే 'తాతాది' అన్నాడు. "ఇంతపెద్దప్రమాణ మెందుకు?" అన్నాను. "చాలాయెత్తున పెట్టితే మామూలుమనిషిలాగ కనబడేటందుకు చేశారు. ఎందుచేతనో తక్కువ యెత్తున పెట్టడంవల్ల ఇలాఉన్నది" అన్నాడు. అతర్వాత బొంబాయినగరంలో తాతాసంగతి తెలిసింది. ఆయనకుమారుడు సర్ దొరాబ్జీతాతాను, మలబార్ కొండమీద ఉన్న ఆయన మహాసౌధాన్ని చూచాము.

తాతా అనేకంచేశాడు. ముఖ్యంగా చెప్పదగినవి కొన్ని. ఆయన వేసినపునాదులమీదనే కొడుకులు మంచిసంస్థలు స్థాపించారు. లోహపరిశ్రమకార్యాలయము, జలవిద్యుద్యంత్రశాల, తాజ్ మహల్ హోటలు, అన్నిటికంటె మరీముఖ్యమైనది బెంగళూరు నగరంలో (The Indian Institute of Science) భారతీయవిజ్ఞానాలయస్థాపన.

శఠకోపాచార్యులుగారు ఈపుస్తకము స్పష్టంగా వ్రాశారు. ఇందులో పార్సీజాతిచరిత్ర, భరతఖండములో పరిశ్రమలవిషయమూ, మొదలైనసంగతు లున్నవి. నాలుగు ఛాయాచిత్రములుకూడా చేర్చినారు.

అర్థికపర ధీనత రాజకీయపారతంత్ర్యముకంటె హానికరమని, పారిశ్రామికనాయకుల (Captains of Industry) చరిత్రలు మనభాషలో లేవని, అటువంటివి ఉంటే యువకులు చదివి బాగుపడతారనే ఉద్దేశంతో ఈపుస్తకం వ్రాసినారట.

విపంచి (ఖండకావ్యసంపుటి) ౦-౪-౦

బొడ్డు బాపిరాజు, ఆదివారపుపేట, ఏలూరు

ఈమనోహరగీతికాస్తోమ మాల
పించుకొన్నది విశ్వవిపంచి మున్నె;
మరల నవరాగమున మధుమారుతమున
దులికి మారు మ్రోగినవి కోకిలగళాన.

ఈ చక్కని పద్యము కావ్యాదిలో ఉంచి కావ్యనామము సార్థకమని కవి సూచించినాడు.

ఇందులో ఇరవై ఖండకావ్యాలున్నవి. 'సాకీ' అనే కావ్యములో కొన్ని పద్యాలు ఫిట్ జెరాల్డు ఉమర్ ఖయ్యాంలో కొన్నిపద్యాల కనువాదంలాగ కనబడుతున్నవి. మిగిలిన వన్నీ స్వతంత్రరచనలు.

పాశ్చాత్యకావ్యాలతో పరిచయం కలిగినతరవాత ఆధునికకవులు ప్రకృతివర్ణన విశేషంగా చేస్తున్నారు. జడప్రకృతిమీద ఈకవికిగూడా ఉన్న ప్రేమ చాలావరకు ఇందులో కావ్యాలన్నింటిలో కనిపిస్తున్నది. "రేరాణి" "చుక్క" "తుంపరలు" "చందమామ" "మెఱపు" "తేటిబోటి" "ఇంద్రధనుస్సు"— మొదలైన కావ్యశీర్షికలే ప్రకృతిమీద కవికి ఉన్న అభిమానం ద్యోతకంచేస్తున్నవి. అయితే ప్రకృతిని వర్ణించడంలో స్వానుభవంకంటె ప్రాబంధకవులసమయాలూ, వాళ్ళ ఊహల వంటి ఊహలూ, ఎక్కువ వ్యక్తమవుతున్నవి. కొన్నికావ్యాల్లో ఈప్రకృతివర్ణనం మధ్యలో ఈకవి స్వానుభవాలు చేర్చి రసవంతాలు చేశాడు. "మెఱపు" అనే ఖండికలో—

"కల దొకవార్త నిన్నడుగగా గమకింతు నెఱింగియున్నచోఁ
బలుకుము నిల్చి, మావలపు పంటకు దెచ్చినబిడ్డ లిద్ద ఱా
త్మలను వగల్ రగుల్కొలిపి మబ్బులమాటు చునారు; నీకు దా
రుల నెపుడైనఁ గన్పడుదురో? మముఁ దల్తురొ? ఓ క్షణప్రభా!"

అని ఒకచోటను, చివరలో—

"ఏమయినఁగాని నీరూపు నామనమ్ము
నింపుకొన్నది సౌదామినీ, నిజాన
కింతయో అంతయో హృదయేశ్వరికిని
సాటివచ్చుట నయనప్రచాలనములు."

అని స్వానుభవాలు ఇమిడ్చి కరుణశృంగారభావాలు కలిగించినాడు.

కవి ఆధునికుడు, నవకవిత్వమం దభిమానం కలవాడు. ఈఅభిమానం కావ్యవస్తువులు ఏఱకొనడంలో ప్రధానంగాను, నిర్మాణంలో స్వల్పంగాను ఉన్నది. ఊహలు, వర్ణించేపద్ధతి, చాలాభాగం పూర్వకవులమార్గమే. ఉత్పలమాలాది వృత్తాలమీదే ఎక్కువప్రీతి. ఒకటి రెండుచోట్ల శ్లేషలుకూడా ఉన్నవి. సాకీ అనేకావ్యంలో—

"వినతఘనాశ్రియ మ్మచలవిభ్రమకారణ మీసుభానికే
తనము పయోధి; సర్వవిబుధప్రియ మోహనమూర్తి వీవు మో
హిని విల; సత్ప్రభప్రియులు మేము, సుధాంధుల; మింక శేల ప్రాఁ
తనుడిని సన్నగిల్లినకథల్ స్మరియింప, సుధాప్రదాయినీ!"

అనేపద్యం చూడండి. ఇందులోశబ్దశ్లేష, అర్థశ్లేష ఉన్నవి. ప్రాఁతనుడి అంటూ చెప్పినపద్యంలోనే పాతనుడి! అయితే పాతనుడిరూపం చూపి అది అట్టే రసవంతంకాదని చెప్పడానికే కవి ఈపద్యం రాశాడేమో!

ఆధునిక భారతప్రపంచాన్ని ఉత్సాహవంతంచేస్తున్న దేశభక్తి కవి సాగరాన్ని సంబోధించి చెప్పిన సుభాషితము అనే కావ్యంలో ధ్వనిస్తున్నది. సాక్షాత్కారము అనే చివరికావ్యంలో కవికి గల ఆంధ్రాభిమానం స్పష్టపడుతున్నది. జినదేవుడు అనేదాంట్లో బుద్ధుని సంసారత్యాగంమీద గౌరవం చూపినాడు.

అరసున్నలదగ్గరనుంచీ జాగ్రత్తచేయవలెననే ప్రయత్నంతో వున్న ఈకవి "ఉషామదితా రత్నము" వంటి సమాసం లేకుండా వ్రాస్తే బాగుండేది. పద్యాలు సాఫీగా నడిపే ఈకవి సాఫల్యములో—

అమృతము జిల్కు వెన్నెలయందు నీవ
నమ్మ వల నందనోపవన మొనరుతురు!"

అని వ్రాశాడు. ఇందులో మొదటిపాదంలో "అమృతమును" అని దిద్దుకుంటే ఛందోదోషం పోతుంది. దాని కుంటినడకమాత్రం బాగుపడదు. అది సరిపుచ్చుకున్నా రెండోపాదంనడక మరీ బాగా లేదు. ఇటువంటినడకలు పద్యాలకు సొగసు కల్పించలేవు.

పుస్తకం చక్కగా నేవుంది గాని అచ్చుతప్పులు జాస్తి. ఇందులో చిత్రపటాలు పుస్తకం అందాన్ని ఎక్కువచేస్తున్న వనుకోము.

నో. న. శా

## ఆంధ్ర హర్ష చరిత్ర

(పూర్వభాగము : రూ ౧-౪-౦)

కొమాండూరు కృష్ణమాచార్యులు, గుంటూరు

భట్టబాణుడు సంస్కృతంలో వ్రాసిన హర్షచరిత్రం జగద్విదితం. విఘ్నదేవత ఆయన రచనలను అంటిపట్టుకున్నట్టు తోస్తుంది. ఇంక ఎన్ని వ్రాశాడో కాని ఇప్పుడు లభ్యమయ్యే కాదంబరీ హర్షచరిత్రలు రెండూ అసమాప్తాలే. అయితే,

"యాతే దివం పితరి తద్వచసైవ సార్థం
విచ్ఛేద మాప భువి యస్తు కథాప్రసంగః
... ... ...
ప్రారబ్ధ ఏష స మయా న కవిత్వదర్పాత్"

అని అతనికొడుకు భూషణభట్టు కాదంబరి పూర్తి చేశాడుగాని హర్షచరిత్ర నెందుచేతనో ముగించలేదు. కాదంబరికంటె ఈ ఆఖ్యాయిక హృదయంగమం కాకపోవడంచేతనో, కథానాయకుడు జీవించివుండడంచేతనో, మరెందుచేతనో చెప్పలేము. సంస్కృతభాషలో ఐతిహాసికరచనలు తక్కువ. ఈ హర్షచరితము, రాజతరంగిణి మొదలైనవి ఏవో కొద్దిగా దొరుకుతున్నవి. ఈగ్రంథం వల్ల గ్రంథకర్తఅయిన బాణభట్టచరిత్ర మరికొందరు విద్వాంసులు, కవులవిషయాలూ, భరతఖండం స్థితీ, చరిత్రాత్మకవిషయాలూ అనేకం తెలుస్తున్నవి. హర్షుడు క్రీ. శ. 655 సం॥ ప్రాంతములో దివంగతుడైనట్టు ఊహించవచ్చు.

సంస్కృత హర్షచరితము ఎనిమిది ఉచ్ఛ్వాసాల గద్యగ్రంథం. ప్రాచీనాంధ్రకవు లెవరూ దీన్ని తెనిగించినట్లు కనపడదు. ఇదివరలో ఇద్దరు విద్వాంసులు దీన్ని వచనంలోకి ఆంధ్రీకరించారు. ఒకరిది అసమగ్రం. ఇద్దరిరచనా తృప్తికరంగా లేదు. ఇక ముందు ఎవరైనా విద్వాంసులూ, వచన రచన బాగా అలవాటుపడ్డవారూ కొత్తగా తెలుగుచేస్తే ఉపయోగకరంగా వుండవచ్చు.

ప్రకృతం సమీక్షిస్తున్న గ్రంథం పద్యకావ్యం. ఆదిమగ్రంథం పద్యరూపంలో వుంటే వచనం లోకి మార్చడం మామూలు. ఈగ్రంథపద్ధతి తద్విపరీతంగా వుంది. కృష్ణమాచార్యులుగారు వచనం పద్యంలోకి పెట్టారు. వెనకనే పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు కాదంబరి పద్యగ్రంథం చేశారు. ఆవిషయం గమనించో, స్వతహాగానే బుద్ధిపుట్టో కృష్ణమాచార్యులుగారు ఈపని చేశారు.

కృష్ణమాచార్యులుగారిది కండగల కవిత్వం. మనిషివలెనే, నడకవలెనే, మహాపటుత్వం, గాంభీర్యం కలది. అందుకనే మిత్రులొకరు వీరిది "తాలింఖానా School of Poetry" అన్నారు. చమత్కారంగా. ఏభాగం చూసినా, ఏపద్యం చదివినా, చాలా రసవంతంగా వుంటుంది. మాతృకలో దీర్ఘంగా వున్నవర్ణనలు సంగ్రహించి, రసపుష్టంకాని కథాభాగం కుదించి, విద్వత్కవులైన ఆచార్యులుగారు అతిమనోహరంగా ఈగ్రంథం సాగించారు.

"ప్రాలేయాచలసానుసారము, భాస్వద్రాజ్యలక్ష్మీలస
ల్లీలామందిరమై, గజేంద్రదశనోల్లేఖాంకితంబై, మహా
నీలాశ్మస్ఫటికోరుహారయుతమై, నీరంధ్రముక్తాఫల
ప్రాలంబాంచితమైన వక్షము మహారాజ్యార్హతన్ దెల్పెడిన్,"

"సింధుమహీనాథ సింధునిర్మథనోరు
మంథాన మెవ్వాని మహిత భుజము,
చకిత ఘూర్జరనరనాథజాగరంబు
లెవని ఘోటకధట్టికా హేష లతఁడు ......

సంస్కృతంకంటె తెలుగులో ఎక్కువ మధురంగా వ్రాయడం కష్టం. కాని ఆచార్యులుగారు కొన్నికొన్ని సందర్భాల్లో మాతృకకు వన్నె పెట్టారని చెప్పవచ్చు.

ఆంధ్రహర్షచరిత్రకు, తెలికిచెర్ల వెంకటరత్నంగారి పరిచయవాక్యాలూ, మేడేపల్లి వెంకటరమణ దాసుగారి విపులపీఠికా, ప్రోద్బలకముగా ఉన్నవి.

## భూప్రదక్షిణుడు భార్యకు వ్రాసిన లేఖలు

గ్రంథకర్త : అత్యం నరసింహమూర్తి, ఎం. ఏ. (న్యూయార్కు)

మొదటిభాగము : 110 పుటలు, వెల రు 0-8-0

ప్రకాశకుడు : కోట నాగభూషణం, బెజవాడ

నరసింహమూర్తిగారు బర్మా, మలయా, చీనా, జపాన్, హవాయి మొదలైన ప్రదేశములగుండా అమెరికా వెళ్ళి, అక్కడ విద్యాభ్యాసముచేసి ఇంగ్లండు, ఫ్రాన్సు, ఈజిప్టు, సుడాన్ అరేబియా దేశములగుండా ఇండియాకు వచ్చినారు. ఈప్రయాణములలో గ్రంథకర్త తనధర్మపత్నికి వ్రాసిన లేఖలలో 37 ఈభాగములో ప్రచురించారు. ఆయాప్రదేశాలలో తనకు కలిగిన కొన్నికొన్ని అనుభ

వాలను, స్థితిగతులను, ప్రదేశవర్ణనలనూ చక్కగా వ్రాశారు. లేఖలను గ్రంథరూపంగా మనదేశంలో విడిగా ప్రకటించడం లేదు. ఇటువంటివాటివల్ల చాలా లోకానుభవం కలుగుతుంది, మనస్సు విప్పారుతుంది. నరసింహమూర్తిగారు సహజమైనభాషలో ఈజాబులు వ్రాసిఉంటే ఇంకా మనోరంజకంగా ఉండేవి. ఇవి 1929 తో ఆగు ఉత్తరాలు. మిగిలిన భాగాలు త్వరలో ప్రకటిస్తారని నమ్ముతాము.

## పంచవటి (అయిదు కథలు) కర్త: శ్రీనివాస శిరోమణి

## వెల 6 అణాలు. ఓరియంటల్ బుక్ డిపో., మద్రాసు



ఈచిన్నపుస్తకంలోని అయిదుకథలూ వరుసగా ప్రతిఫలం, ఏకాకినీ, శృంగభంగం, దారద్వయం, ప్రేమలేఖ అన్నవి.

“ఈకథలు బాగున్నవని మెచ్చుకున్నా, బాగాలేవని తిట్టినా, ఆదూషణభూషణలు శ్రీ శివశంకరశాస్త్రిగారికే చెందుతవి” అని గ్రంథకర్త పీఠికలోనే విమర్శకులకాళ్ళకు బంధం వేస్తున్నట్టు కనిపిస్తుంది. కాని పైవాక్యం వ్యంగ్యంగా విమర్శనకు ఆహ్వానమే అని భావిస్తాం.

ఈరచయితకు ఛలోక్తి జాస్తి అనేది పాఠకునికి ముందుగా తోచేవిషయం. ఈఛలోక్తే పాఠకుణ్ణి పొంగెత్తించి చదివించేదీ, రచయితను అజాగ్రతలోకి తోసి ఉదాత్తసన్నివేశాలని పరిహాసవాతావరణంలోకి దిగదించేదికూడా అయివున్నదని చెప్పవలసి వస్తోంది.

ఛలోక్తే జీవంగా చేసి రక్తికట్టించడం ఒకకౌశలము అవుతుందని ఒప్పుకుంటాం. అందుకు ఈ 'పంచవటి' లోని తుదికథ 'ప్రేమలేఖ' చక్కని ఉదాహరణం. అయినా, రచయిత ఆసక్తి యింతటితో తృప్తిపొందేది కాకపోవడంచేత తతిమ్మా నాల్గుకథలలోనూ ఆలోచనలు పురికొల్పే కథావస్తువును తెచ్చుకున్నారు.

ఏకాకినీ, శృంగభంగం, దారద్వయం, అనేకథలలోకన్న గ్రంథాదిని వున్న 'ప్రతిఫలం' అన్నదానిలో క్లిష్టతర మైనకథావిషయం ఏరుకున్నారు. అన్నికథలలోనూ అధునికసంఘజీవితసమస్యలే విషయములు. ప్రత్యేకము 'ప్రతిఫలం'లో సమస్త సంఘమును, ముఖ్యముగా తరుణీసంఘమును, కలతపెట్టుతున్న తీవ్రసమస్య. వివాహిత అయినా ముగ్ధ అయినబాలిక మీద సంకుచితభావసంస్కారము గలభర్త బలాత్కారముగా హిందూలాయొక్క మూర్ఖపాశములను పన్ని, దాంపత్యాధికారము (Conjugal rights) గడించటానికి విఫలప్రయత్నము చేసి తుదకు పిల్లను ద్వేషభావముతో పరిత్యజించి, పునర్వివాహము చేసుకున్న అత్యంతవాస్తవికము (Realistic) విషాదభూయిష్ఠమును (tragic) అయినగాథ ఈకథావిషయము. ఇట్టిస్థితిలో బాలికజీవితసమస్య తేల్చటం ఎల్లా అన్నది యిందులో ఆలోచనీయాంశము. భర్తకు పునర్వివాహపుహక్కు కలిగిన హిందూలాలో భార్యస్థితి నిరర్థకము, నిస్సహాయముగా వదలబడిఉన్నది. ఈశోచనీయ పరిస్థితులకు ప్రతిక్రియ 'విడాకుల చట్టము' (Divorce Act) అన్నది ఈరోజులలో విజ్ఞులకు తెల్లమై ప్రచార మవుతున్న సంగతే. ఈమాట రచయిత సూచించి తనముఖ్యపాత్రలచేత ఛలోక్తిగా 'make her a widow' అని గిరీశప్రాయంగా పల్కించి, ఆవేదవాక్యమును స్థిరీకరించటానికి ఖూనీకాండ నడిపించి బాలికకు పునర్వివాహం సిద్ధింపించారు. ఇది విచిత్రమైనపర్యవసానమై చదువరులకు తాత్కాలికోత్సుకత కూర్చినా గంభీరభావన గలకథకుడు కల్పించదగిన ఉత్కృష్టసన్నివేశము కాదని మాత్రము స్ఫురించక మానదు. Weak and melodramatic effect అని ఆంగ్లములో అనుకునే అభిప్రాయానికి

ఈమాదిరి కథాపోషణమే దృష్టాంతము కావచ్చును. ఇంతేకాక కథామధ్యంలో ఒకపాత్రచేత కథలో కథను ఒకేబిగిని 12 పేజీలవరకూ కొటేషన్ మార్కులలో చెప్పించటం అంతగా సమంజసము కాదేమో అనిపిస్తుంది. అయితే ఈకథ రచయిత వ్రాసినవానిలో ప్రథమలిఖిత మైయుండవచ్చు.

ఏమంటే తరువాత వచ్చే మూడుకథలూ శైలిలో ఏమి, సంభాషణాచాతుర్యంలో ఏమి, సన్నివేశ క్రమంలో నైతేనేమి, పైకథకన్న ఎక్కువపరిపక్వతను ద్యోతకం చేస్తున్నాయి. ఈమూడుకథల లోనూ అంశమునుబట్టి తారతమ్య మేర్పరచవలె నంటే మొదట 'ఏకాకిని', తరువాతి 'దారద్వయం' వస్తాయి. 'దారద్వయం' లోని విషయం, తెలియనిబాల్యంలో వివాహమయిన తనభార్యను వదలి కథానాయకుడు యౌవనవంతు డైనపిమ్మట తాను ప్రేమించినబాలికను పునర్వివాహము చేసుకొనుట, తమపరి యిరువురుభార్యలను ఏలుకొనుట కథలో రచయిత సమకూర్చినంత సునాయాస మైనసన్నివేశాలు వాస్తవిక జీవితంలో ప్రతియువకునికీ యువతికీ కలుగవు. పరిత్యక్త యైనప్రథమభార్యవిషయమై నిజప్రవర్తన యిదమిత్థ మని న్యాయముగా నిర్ణయించుకొనడం క్లిష్టసమస్యయై పరితపించే కథానాయకుడు అంతవరకూ తాను అసహ్యించుకుంటోన్న ఆమె ప్రథమపర్యాయమే యౌవనసౌందర్యంతో హఠాత్తుగా తనకంటబడినవెంటనే పరవశుడైపోయి దుఃఖాంతము కావలసినకథను ఇంద్రజాలంలాగా సుఖాంతంచేసి ఊరుకున్నాడు. రచయిత పైసమస్యను హేతుభూత మైనపర్యవసానానికి నడిపించలేక కథను టక్కున Switch వేసి ఆపివేసినట్లు తోచక మానదు.

ఇక 'ఏకాకినీ' అన్నకథలోని అంశమూ, హిందూసంఘంలో ఇంతవరకూ వివాహములలో పరిగణింపబడనిదీ, అనేకబాలికలజీవితాలను ధ్వంసముచేస్తున్నదీ అయిన సూక్ష్మకామశాస్త్రయవిషయము (Sex question). ప్రతిబాలికా సామాన్యముగా వయసువచ్చినదనుకొనే కాలానికే దాంపత్యానికికూడా పాత్రురా లైనట్లు ఎంచడం పొరపాటని నేటిపాశ్చాత్య కామశాస్త్రజ్ఞులు చాటుతున్నారు. ఈరహస్యము ఎరుగని మనపెద్దలును, వరులూ కూడా అనేకముగ్ధబాలికలను బలాత్కారదాంపత్యజీవితములో త్రోసి దుఃఖములపాలుచేస్తున్నారు. సత్య మైనకామశాస్త్రీయజ్ఞానమును బాలురకు బాలికలకు పెద్దలు యౌవనారంభదశనుంచి నిర్మొగమాటముగా తెలుపుదు చేయకపోవడంచేత వారికి కలిగేమనోవికారాలను, తన్మూలమున కలిగే అపోహలచేత సంభవించే విషాదసన్నివేశాలను ఈచిన్నికథలో ఇముడ్చడానికి రచయిత ప్రయత్నించారు.

ఈగ్రంథసందర్భంలో ఒక్కమాటమాత్రము చెప్పవలసియుంటుంది. సాంఘికసమస్యలను విషయముగా చేసుకున్నకథలలో సన్నివేశములుకాని, సంభాషణాలుకాని అందులో సమస్యయొక్క ప్రాముఖ్యతను, క్లిష్టతను, గౌరవమునకు తగినఉదాత్తరీతిని లొంగి నడువలేకాని, ఆసమయములలో ఛలోక్తులు పరిశోధకనవలలలోవంటి అల్పచమత్కారపర్యవసానాలు Detective-story-endings) కథాంశముయొక్క పుష్టిని నీరసింపజేసి, ఆంగ్లములో Bathos అనే రసభంగము కలుగజేస్తవన్నమాట నిశ్చయము.

కాని 'పంచవటి'లో రచనములను సంపుటదృష్టితో విలువ కట్టుకున్నయెడల ఆధునికాంధ్ర కల్పనాసారస్వతములో బయలుదేరుతున్న ప్రథమకథాసృష్టిలో ఉత్తమశ్రేణీ ప్రాంతములోనే స్థానము పొందుననిమాత్రము చెప్పక తప్పదు. సాంఘికసమస్యలను ఉపకరణములుగా తీసుకొని వ్రాయు రచయితలు అరుదైన తెనుగుసారస్వతమున ఆకర్షణీయములైన సన్నివేశములకు తోడ్పడే సహజసంభాషణోచిత వ్యావహారికశైలిలో శిరోమణిగారు తమకథలను నడుపగలిగినారంటే, అది సర్వసామాన్య సమర్థమైనవిషయముగా ఎంచవలసినది కాదు. విపులవిమర్శనకు అవకాశము కల్పించడమే ఈసంపుటములోని రచనలవిశిష్టతకు తార్కాణమనీ చెప్పుకోవలసి ఉంటుంది.

మల్లవరపు విశ్వేశ్వరరావు

## భాగవతావతరణము (పద్యనాటిక) ౦-౪-౦

నోరి నరసింహ శాస్త్రి, సాహితీసమితి

ప్రాప్తి స్థానము : నవ్యసాహిత్యపరిషత్తు. గుంటూరు

ప్రతిపద్యమనోహరమూ, ఉదాత్తభావబంధురమూ, విశిష్టశిల్పకళామయమూ, అయి శ్రవణమాత్రన మనోరంజకమై, భావనామాత్రన పరనిర్వృతి గలిగించగలిగిన ఈకృతి నరసింహశాస్త్రిగారి కళాతపస్సుకు ఉత్తమఫలం. ఈగ్రంథం ప్రకటితమై ఇంతవరకు కొంతకాలం అయింది. తెలుగుసారస్వతంలో అంతో యింతో కృషిచేస్తున్న నేను ఈకృతిని ఇంతవరకు చదివిఉండకపోవడం మహాపరాధం. ఇప్పుడే ఈకృతి చదివాను. ఎన్నిసార్లు నా శరీరం, హృదయం, ఆత్మ పులకించిపోయినవో చెప్పలేను! కావ్యం చిన్నది. ఈకొద్దిఅవకాశంలో పఠితను అతీంద్రియ అవస్థలోకి తీసుకుపోగల మహాప్రభావాన్ని నరసింహశాస్త్రిగారు ఇమిడ్చారు.

ఈకృతినిచదివిన ఉత్తరక్షణంలోనే వ్రాస్తున్న ఈసమీక్షావేశం కృతిని అంగాంగపరీక్ష చేసేదిగా వుండదు. కృతి ఒక అఖండస్వరూపంగా నాహృదయంలో కనబడుతోంది.దాన్నిచూస్తూనే ఈప్రశంసావేశం వ్రాస్తున్నాను...... కొంతసేపు ఆగి మళ్ళీ విచారించాను. కృతిమీద నా అభిప్రాయం ఏమీ తగ్గలేదు. శిల్పదృష్టిలో కొన్ని విశేషసౌందర్యాలు కనబడ్డవి.

పైలవైశంపాయనుల పలుకులకు సాదాఫక్కీలో గీతం, ఆటవెలదీ వాడడం, సామవేదం ఉపదేశం పొందిన జైమిని శ్రుతిమనోహరమైన ముత్యాలసరంలోనూ, అధర్వవేదం అభ్యసించిన సుమంతుడు మత్తకోకిల అనే విపులచ్ఛందాన్ని వాడడం ఎంతో మనోహరంగా ఉంది. ఈవిధమైన ఛందశ్శిల్పం గ్రంథమంతటా పాటించారు. కృతిప్రారంభంలో వేదవ్యాసుని వాక్కులు వైదికమైన ఉదాత్తత, సాంస్కృతికమైన గంభీరత, ఆర్షమైనపవిత్రత, కుంభించుకుని ఎంతో మనోహరంగా వున్నవి.

భగవల్లీలాదర్శనం పొందిన వ్యాసుడి చిత్తవృత్తి, తన్మయుడైన శుకుని నృత్తగీతాలు - ఆహా - ఎంతహృదయంగమంగా వున్నవి! శాస్త్రిగారిలాంటికృతులు ఎన్ని వ్రాస్తే మాకు తృప్తి కలుగుతుంది! ఈదృశకృతులు వ్రాయడానికి శాస్త్రిగారికి అర్హత వుంది. ఇవే వారు వ్రాయాలి.

పా

## తరంగిణి (ఖండకావ్యసంపుటి) వెల పావలా

కందుకూరి రామభద్రరావు, బి. ఏ., రాజమహేంద్రవరము

"తరంగిణి"ని ఆమూలాగ్రం సానుభూతితో, ప్రసన్నహృదయంతో చదివాను. "ప్రవేశిక"లో చెప్పినట్లు ఈకవి సరళహృదయం కలవాడనీ, కావ్యంలో ప్రౌఢోక్తి లేదనీ, ముందుముందు ఎక్కువ పరిణతి పొందవచ్చుననీ తోచింది. "ఒకవయస్సు వస్తేగాని, ఒకవిధమైన బాధ కలిగితేగాని, కవిత్వం నిగ్గుతేలదు" అంటున్నది ప్రవేశిక. ఆవయస్సు వచ్చి, ఆబాధ కలగకపూర్వం వ్రాసేదంతా "ఆరితేరినకవులు సామాన్యంగా గ్రంథస్థంచేసే ప్రేమ, భక్తి, సంసారసమస్య, దేశారాధన మొదలైనవన్నీ" కావ్యంలో అల్లడంమాత్రమే అవుతుందని చెప్పవచ్చు.

"ప్రకృతిని సూటిగా విలోకించడంవల్లగాని, అకృత్రిమమైన అనుభవాన్ని బట్టిగాని ఉద్భవమైన భావాలనే ఈయన పద్యాల్లోనూ, పాటల్లోనూ" పొదిగినట్లూ, ఛందస్సులో, భావంలో, భాషలో విలక్షణత, చమత్కృతి ప్రదర్శించడానికి సుతరామూ యత్నించనట్లు తోస్తోంది. గనక అలక్షణాలను ఈగ్రంథంలో అపేక్షించగూడదు.

'పాట' అనేకావ్యంలో ఊహవిభావనాబలం పారం ముట్టింది. 'సానుభూతి' అనేకావ్యం రసవంతంగా వుంది. 'విరహిణి' మృదువుగా, అమాయికంగా వుంది. 'అన్వేషణ' అనేకావ్యం భావంలో భాషలో, ఠాకూరు కృష్ణశాస్త్రిగార్ల ప్రభావం గోచరిస్తూంది.

తరంగిణి కవిమీద పాఠకుడికి అప్రతర్కితంగా అభిమానం కలిగి, ఎందుచేతనో ఈకృతి బాగున్నదనాలి అనిపిస్తుంది. కుటిలపదఘటనల్లో అయోమయం వ్రాసి లోకాన్ని బూకరించే ఉద్దేశం కవికి లేదు. అలతిభావాలను అలతిమాటల్లో అప్రయత్నంగా చెబుతాడు. బహుశా ఈఅంతశ్శుద్ధివల్లే మనల్ని కవి ఆకర్షిస్తున్నాడేమో! తరంగిణి ఈషదపరిణతంగా వున్నది అనిచెప్పినప్పుడే కవియొక్క కవితాత్మలో, దాని భవిష్యద్వికాసంలో, మనకు విశ్వాసం ఉన్నట్లు.

పా

[ సమీక్షార్థము పంపేవారు పుస్తకప్రతులు రెండు పంపవలెను. 'ప్రతిభ' ప్రకటనకు మా సముపూర్వమే గ్రంథాలు కార్యాలయానికి చేరవలెను. సంపాదకుడు ]

*

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు

# వీణ

సంపాదకుడు : పాటిబండ మాధవ శర్మ, ఎం. ఏ. (ఆనర్సు)

మాసపత్రిక. చక్కని గేయములు, పద్యములు, వ్యాసములు, కథలు ఉంటవి. చందా రూ ౨

"వీణ" ఆఫీసు, తేలప్రోలు, కృష్ణాజిల్లా

---

# ఉదయిని

సంపాదకుడు : కొంపెల్ల జనార్దన రావు

నవీనుల రచనలు ప్రధానముగా ఉండే సాహిత్య విషయక మాసపత్రిక

ఇందులో కిరణాలు, శృంగాటకము, వాఙ్మయ వీధి - సరసములు భావోత్తేజకములు

సంవత్సరపు చందా రు ౪

15 ఆదెప్ప ముదలివీధి - జే…

---

# ప్రతిభ

## త్రైమాసిక పత్రిక - సంవత్సరపు చందా రూ ౩

## కదంబము

పద్య కావ్య సంపుటి - కవిమిత్రులు రచించినది

ఇందులో నలుగురు ఆధునిక కవులు రచించిన ఖండికలు, గేయములు ఉన్నవి. ౦-౪-౦

## భాగవతావతరణము

నోరి నరసింహ శాస్త్రి ప్రణీతము

చిన్న పద్యనాటిక. కృష్ణద్వైపాయనునకు భాగవతరచనకు ప్రరోచనము మొదలైన విషయాలు వర్ణితములు. వెల ౦-౪-౦

## పద్మావతీ చరణ చారణ చక్రవర్తి

తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి విరచితము

ఇది మూడురంగముల పద్యనాటిక. గీతగోవింద కావ్యప్రశస్తి ఇందులో కలదు.

వెల ౦-౮-౦. పరిషత్సభ్యులకు ౦-౬-౦

## నవ్య సాహిత్య పరిషత్తు . గుంటూరు

# శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారి సప్తతితమ జన్మదినోత్సవ ప్రచురణములు

## ౧ : వ్యాస సంగ్రహము A MISCELLANY OF PAPERS

పంతులుగారి వ్యావహారిక భాషాభిమానమును గురించి వారి ౭౦ వ జన్మదినమున విద్వాంసులు సమర్పించిన వివిధ విషయక వ్యాసముల సంపుటము. రూ. ౭-౮-౦.

## ౨ : వ్యాసావళి

భాషాతత్త్వప్రసక్తిపూర్వకముగాను, ఆంగ్లసంస్కృతాది భాషావాఙ్మయ చరిత్రములతో పోల్చిచూచి ఆంధ్రభాషాపరిణామమును నిరూపించేవ్యాససంపుటము రూ.౧.

## ౩ : బాలకవి శరణ్యము

పండితులు లక్షణవిరుద్ధము లనీ, గ్రామ్యము లనీ నిందించిన రూపములు నిర్దుష్టములని కవుల ప్రయోగములు ఉదాహరించి నిరూపించిన లక్షణగ్రంథము. రూ. ౧-౮-౦.

## ౪ : ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము

శ్రీ వేదం వెంకటరాయ శాస్త్రులుగారి రచనలలోని ఆంధ్రభాషా పాండిత్య పరిశీలనము. రూ. ౧.

## ౫ : గద్య చింతామణి

వచన రచనా సంప్రదాయమును నిరూపించుటకుగాను ప్రాచ్య లిఖితపుస్తకభాండారము మొదలైన తావులలోని ముద్రితాముద్రితగ్రంథములనుండి సంతరించిన గద్య భాగముల సంపుటము. రూ. ౧-౮-౦.

## నవ్య సాహిత్య పరిషత్తు. గుంటూరు

Edited, Printed and Published by T. Venkataratnam, *M. A., L. T.*,
Chandrika Press : Guntur